# గ్రామదేవతలు

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

మన భారతదేశమునందు విశేషించి మనయాంధ్ర దేశమందు "గ్రామదేవత" లను అమ్మవార్లు ప్రతి గ్రామమునందును ఒకరిద్దరు ముగ్గురు - గ్రామము ననుసరించి- పట్టణము ననుసరించి-తప్పక కలరు. వారి కాయా గ్రామస్థులును బట్టణవాసులును ప్రతివత్సరము వత్సరోత్సవములను పూజోత్సవములను వీలుకొలందిగఁ జేయుచున్నారు. విషూచి మశూచి మొదలగు వ్యాధులు తమతమగ్రామములలో వ్యాపించినపుడు పరగ్రామదేవత లీగ్రామములకు నశరీరయానముతో వచ్చి జనులను హింసించుచున్న వని- ప్రకృతిశాస్త్రజ్ఞానాభావముచే- మూఢ ప్రజలు పరదేవతాసంతృప్తికొఱకును, స్వగ్రామదేవత తృప్తినొంది బలవతియై యన్యదేవతలఁ బాఱఁద్రోలుటకొఱకును, బలుల నుత్సవముల విశేషించి చేయుచున్నారు. ఆయుత్సవములలో సాధారణముగా నీచ జాతిస్త్రీకిఁగాని, పురుషునకుఁగాని, గ్రామదేవత యావేశించి, శివమాడును. క్వాచిత్కముగా, బ్రాహ్మణులకుఁ గూడ శివమెత్తుట కలదు. ఈ గ్రామదేవత లెవరో వీరి వృత్తాంత మేమియో స్వల్పముగ విచారణసేతము.

వేదవాఙ్మయమునందు గాని, స్మృతి పురాణ వాఙ్మయములందు గాని, ఈగ్రామదేవతల ప్రశంస కానరాదు. వైదిక వాఙ్మయమునందు బలులు కలవు. కాని యాబలివిధానము ఇంద్రాది వైదికదేవతలకొఱకే నగ్నిముఖమున వేల్వఁబడునదే యై యున్నది. ఏనాఁడు వామాచారయుక్తము లగు తంత్రములు బయలుదేఱెనో, నాఁటినుండియే, జంతుబలియును అన్యదేవతోపాసనార్హ మాయెను. వామాచారము ననుసరించి హైందవ దేవతలలో మార్పు గలిగి వామాచార ప్రోక్త "కాళి" హైందవాచారమున నీశ్వరపత్ని యగు పార్వతిగా మార్పు నొందెను. అట్లే తంత్రగ్రంథప్రోక్తలగు నన్య దేవతలు హైందవాచారమున లక్ష్మి సరస్వతి మొదలగు శాంతరూపిణుల మాఱురూపునొంది యారాధింపఁబడిరి. ఇంచుమించుగ నామార్పు ఆకాలమున వ్రాయఁబడిన పురాణగ్రంథములలో - నీ స్త్రీదేవతాగాథలు వారిజన్మములు- విచిత్రముగా పెంచి వ్రాయఁబడినవి. జాతివైషమ్యము పెరుఁగకుండుటకుఁ గాఁబోలు బ్రహ్మక్షత్త్రియ వైశ్య శూద్ర దేవతాస్త్రీలే గాక చాండాలదేవతలగు "మాతంగీ, శ్యామలా" మొదలగువారుకూడ సర్వవర్ణములవారిచేతను నుపాసింపఁబడిరి. ఇప్పటికిని నుపాసింపఁబడుచున్నారు. ఈయుపాసనలకుఁదగిన మంత్రతంత్రాదికములు గల సంకల్పములు పెక్కులు పుట్టినవి. కాని ఆదేవతల యుపాసనాదికము నేఁడు చాలవఱకు తగ్గియున్నది. కాని వాని నన్నింటిని మించి గ్రామదేవతోపాసనము విజృంభించినయది. ఈగ్రామదేవతలలోను బ్రహ్మక్షత్త్రియ వైశ్యశూద్ర జాతి గ్రామదేవతలు కలరు. ఈగ్రామదేవతలకాయాగ్రామములలో గొందఱకుఁబుట్టింటివారునుఁ గలరు. గ్రామదేవతలలోఁ గొందఱుదేవతలకు అప్పలగు దేవతలు- చెల్లెండ్రగు దేవతలునుఁ గలరు. బ్రాహ్మణీదేవతలకు బ్రాహ్మణ్యముగను మాంసవర్జితముగను, అబ్రాహ్మణీదేవత కబ్రాహ్మణ్యముగను మాంససహితముగను బలు లిడఁబడును. బ్రాహ్మణీదేవతలకు నన్నాదికము వడపప్పు పానకము శ్రీసూక్తవిధానార్చనము - బ్రాహ్మణుఁ డర్చించుట- శివము బ్రాహ్మణునికే ఎత్తుటయు కలుగును. గరగను మాత్రము చాకలి యెత్తికొని యాడును. అబ్రాహ్మణీదేవతారాధనమునఁ గోళ్ళు, మేఁకలు మొదలగువానిబలులతో నెట్లుజరుగునో పెక్కండ్ర కనుభవసిద్ధమే కావున వ్రాయ నవసరములేదు. ఈ గ్రామదేవత లెవ్వ రనఁగా- రాజా రామమోహనరాయల వారు, మహాప్రయత్నముచేసి - బ్రిటీషు ప్రభుత్వమును ప్రోత్సాహపఱచి సహగమనము నణంపఁజేయుటకుఁ బూర్వము మనదేశమునందు సహగమనముం జేసినవీరవనితలే! సహగమనముఁజేసిన ప్రతిస్త్రీయును గ్రామదేవతలు కాలేదు. పరప్రోత్సాహము ఇసుమంతయైన లేక పతియందేకాగ్రచిత్తయై - యగ్నిలో దుమికిన మహాపతివ్రతను- ఆయాగ్రామస్థులు, తమగ్రామమును రక్షించెడి పరదేవతఁగాఁదలఁచిఆమెను విగ్రహరూపిణినిఁగఁజేసికొలుచుటకుఁ బ్రారంభించుచుండిరి. వీలుకొలఁది, దేవాలయాదులును బయలుదేఱినవి. ఆవీరవనితల యత్తవారికంటెఁ బుట్టినింటివారు (తమ యాఁడుపడుచు మహాపతివ్రతయనుట ఖ్యాతి

కరము గాన) ఆదేవతారాధనను విశేషముగఁ జేయుదురు. బ్రాహ్మణీదేవత మాంసమునుగోరదు. గాన జంతుబలిని ఆదేవత కొసంగరు. కొన్ని ఉదాహరణములు:—

గోదావరిజిల్లా రామచంద్రపురంతాలూకా చోడవరంలోని బంగారమ్మ, అంబికపల్లెగ్రహారములోని అంబికాలమ్మ బ్రాహ్మణీదేవతలు. అంబికాలమ్మ మాయింటి యాఁడుపడుచని ప్రఖ్యాతి. మానరసంభట్లుగారు 16 వ శతాబ్ది నగ్రహారమును సంపాదించి తనయాఁడుపడుచుపేరుఁ బెట్టెనఁట. అందువలననే అంబికపల్లెగ్రహారము అని ప్రసిద్ధియయ్యెనని వాడుకకలదు. కాకినాడతాలూకా మేడపాడులోని మహాలక్ష్మి చుండ్రువారియాఁడుపడుచు. ఆమెపుట్టినింటివారి వంశస్థులింకనుఁ గలరు. ప్రతిసంవత్సరోత్సవముననుఁ జుండ్రువా రాదేవతకు విశేషసత్కారములను జేతురు. వేండ్ర (కాకినాడతాలూకా) గ్రామవాసిని యగు వెలగాలమ్మ నర్లవారి యాఁడుపడుచు. ఈమె యక్క రామచంద్రపురంతాలూకా పాణింగపల్లిలో గొల్లాలమ్మ యను పేరుతో నున్నది. ఈదేవతల యుత్సవములయందన్యోన్యము గరగలు-అక్కను జూచుటకు చెల్లెలు - చెల్లెలను జూచుట కక్కయును - వచ్చుచుండును. నర్లవారీ యుభయదేవతలను సత్కరింతురు. గంగమ్మ యనుదేవత యుద్ధమున తనపతి మృతినొందుటచేతఁ దానా భర్తతో కాకినాడతాలూకా బ్రహ్మదేవము మేడపాడు గ్రామముల మధ్యను యుద్ధభూమియందు సహగమనముచేయుటచే, నుభయగ్రామవాసులు నాదేవతకు విశేషోత్సవములను జేయుచుండిరి. ఆమెకు దండుగంగమ్మ యని పేరు. మఱియును గ్రామదేవతలలోఁ బడుచువాండ్రను ముసలివాండ్రనుఁగూడ కలరు శిలావిగ్రహములనుఁగూడ నిలుచుండు చాయాకారముననే చేయించిరి. కాకినాడతాలూకా మేడపాడునందు ఆటపాకలవారి యాఁడుపడుచనఁబడు పాల్లమ్మ 80 సంవత్సరముల యీడున సహగమనమును జేసెను కాఁబోలును! ఆమెను ముసలి దండురు. ఆమెవిగ్రహము 80 సంవత్సరములవయసుగల స్త్రీ కూర్చుండినట్లులు గాన్పించును. చోడవరములోని బంగారమ్మ ఇరువది ఇరువదియైదేండ్ల నిండు జవ్వనమున సహగమనమును జేసినట్లు లాదేవతాపూర్ణయు సతీవిగ్రహముచే నూహ్యమగుచున్నది. సాధారణముగా 40, 50 సంవత్సరముల వయస్సు గల పతివ్రతలే గ్రామదేవతారూపముల నెత్తియుందురని విగ్రహముల ననేకమును జూచి యూహించితిని. 1890 ప్రాంతమున మా తండ్రిమాతామహుని మేనత్త సహగమనమును జేసెనఁట. గుడినిగట్టించుటకు గాని విగ్రహమును జేయించుటకుఁ గాని తత్కాలపరిస్థితులవలన వీలుపడలేదు. ఆపతివ్రతాతిలకముయొక్క సహగమనసమయమునందిచ్చిన గుడ్డపేలికను మాపితామహియు నామెతల్లియును ప్రతిశుక్రవారమునఁ బూజించుచు ధూపములను వేయుచుండెడివారు. ఆయూరిలోనివారి కేదేని రోగబాధాదికము కలిగినయెడల నీపూజాక్షతలనుగొని రోగులుధరించినచో, కుదిరెడినఁట! 38 సంవత్సరముల క్రితము మాగృహము పరశురామప్రీతి కాఁగా నాపేలిక లందు దగ్ధమగుటచేత నీయక్షతలు నాటితో నంతమొందెను. మన సాంఘికచరిత్రములలో గ్రామదేవతాచరిత్రములు కూడ నిమిడియున్నవి. కాని ఈచరిత్రములను మనము మఱచినాము. ఇట్లే ఇంకను ఎన్ని సాంఘికచరిత్రములను మఱచితిమో!!

# సరస్వతీ వాచక పుస్తకములు

భారతీ రఘుపతేంద్రరావు పంతులుగారి ప్రచురణము.

ఈ వాచకములు Text Book Commitee వారిచే ఆమోదింపబడిన 1921 సం॥ జూన్ 22 తేది గెజటులో ప్రచురింపబడినవి. వెంటనే మేము మామిత్రుల సలహాపైన శ్రీ డైరెక్టరువారి Proceedings R. C. No. 124 /I) Dated 11-7-10 ప్రకారము Co-operative Societies and Industries ను గురించి పాఠములు వ్రాయించి వెనువెంటనే పుస్తకములలో చేర్చి ప్రచురపరచితిమి. అప్పటినుండియు మా చిన్నివాచకములు సర్వజనాదరణమును బడసి, దినదినాభివృద్ధి నొందుచుండ మా మిత్రు శ్రీ పుస్తకములు Text Book Commitee వారిచే నామోదింపబడినవి గావనియు ఇందు కొన్నిపాఠములు హెచ్చుగా నున్నవనియు శ్రీడైరెక్టరు వారికి తెలియపరచి మాపుస్తకములలో లేనిపోని నిందారోపణముచేయుచు, చాలమంది విద్యాధికారులకు తెలియజేసిరి.

గుణగ్రహణపారీణులైన శ్రీ డైరెక్టరువారు మేము చేర్చిన పాఠములను ఆమోదించుచు Special case గామాకు Proceedings R. C. No. 185 E 21-10-1922 తేదిని పంపియున్నారు. కావున విద్యాధికారులకును ఉపాధ్యాయులకును మేము విన్నవించుకొనున దేమనగా నిందారోపణముచేయు మామిత్రులమాటవిని మా సరస్వతీవాచకములపై కినుక బూనక అనేక నూతనవిషయములతో ప్రచురింపబడిన మా చిన్నిపుస్తకములను వాడుకలోనికి తెచ్చుభారము మీయది. కావున తగుకీర్తిని మాకు ప్రోత్సాహ మొసంగగలందులకు గోరుచున్నాము.

పుస్తకములు వలయువారు:—గోదావరీ బుక్కు డిపో, రాజమండ్రి అని వ్రాసిన బడయగలరు.

అద్దేపల్లి లక్ష్మణస్వామి ప్రకాశకుడు

N. B. మావద్ద ఎలిమెంటరీ విద్యార్థుల కుపయోగించు అన్నిరకముల స్కూలుపుస్తకములు స్టేషనరీసామానులు, నాటకములు నవలలు వగైరా అన్నియు దొరకును.

# జాతీయవిద్యాలయ ఇండస్ట్రియల్స్ లిమిటెడ్, ఒంగోలు

(1913 సం॥ 7-వ నెంబరు ఆక్టుక్రింద రిజస్టరు కాబడినది)

డైరెక్టర్లు

1. మ. రా. రా. కొప్పరపు వెంకటకృష్ణారావు పంతులుగారు, భూస్వాములు, మేనేజింగ్ డైరెక్టరు.
2. ,, చిన్నకుల శ్రీరామశర్మగారు, భూస్వాములు ఒంగోలు తాలూకాబోర్డు వైస్‌ప్రెసిడెంటు.
3. ,, టంగుటూరి ప్రకాశం పంతులుగారు స్వరాజ్యపత్రికా సంపాదకుడు, మద్రాసు.
5. అర్హులగు వాటాదార్లలోనుంచి యెన్నుకొనబడుదురు.

4. మూలధనము 50,000 రూపాయలు.

వాటా 1 కి 20 రూ॥ చొప్పున దిగువ ప్రకారం చెల్లించదగిన 2,500 వాటాలుగా విభజింపబడినది.

దరఖాస్తుతో రూ 5 లున్ను అలాట్‌మెంటయిన పిదప 5 రూ లున్ను మిగిలిన సొమ్ము వాయిదా 1 కి 5 రూపాయల చొప్పున రెండు వాయిదాలమీదను చెల్లించవలసియున్నది.

ఒంగోలు జాతీయ విద్యాలయముయొక్క పరిశ్రామిక శాఖను యీ కంపెనీవారు స్వాధీనపరచుకొని అందు జరుగుచుండు నూలువడుకుట, నేత నేయుట, వడ్రంగము, పలువిధములైన చాకులు, మంగలకత్తులు, తాళములు, యినుప కుర్చీలు, యినుపపెట్టెలు వగయిరా కమ్మరపనులు. మున్నగు వాటిని వృద్ధిపరచి జరుపుచున్నారు. విద్యార్థులకు పరిశ్రామిక విద్యల గరపుటకు తగిన వసతులు కల్పించుటకు కంపెనీవారు యేర్పాట్లు చేయుచున్నారు. 1922 వ సం. జూన్‌నెల 5వ తేదీనుండి సర్టిఫికెట్ పొంది పని ప్రారంభమయినది. స్వదేశ పరిశ్రమల ప్రోత్సాహపరుప తలంచినవా రందరు వాటాలు పుచ్చుకొన ప్రార్థితులు.

ప్రాస్పెక్టస్ దరఖాస్తు ఫారములు కంపెనీ మేనేజింగ్ డైరెక్టరుగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

# గిరిబ్రదర్సు

స్టేషనర్సు, ట్రిప్లికేను, మద్రాసు.

అన్నిరకముల స్టేషనరీ సామానులు, కాగితములు, పెన్సిళ్లు, కలములు, సాళీలు, నోటుపుస్తకములు. విద్యార్థుల కక్కరకువచ్చు పుస్తకములు, మొత్తముగాను, చిల్లరగాను తక్కువ వెలలకు అమ్మెదము.

ఫౌంటెను కలములు అన్నిరకములు మాయొద్ద దొరకును. మేలైన స్వానుబర్డు కలములు, చక్కని స్వానుకలములు, సొగసైన వాటరుమేను కలములు, నమ్మకమైన నెప్ట్యూనుకలములు అనేక ఇతరరకముల ఫౌంటెనుకలములును మొత్తముగాను చిల్లరగాను మాయొద్ద దొరకును. మిక్కిలి తక్కువ వెలలు. ఉత్తరముల వ్రాసిన ధరలు తెలుపగలము. మాకంటె తక్కువవెలలకు ఇతరచోట్ల దొరకవు

ఫౌంటెను కలములలో పోయు సిరాలు, స్వాను, వాటరుమేను మొదలగు రకముల నేకములు కలవు.

# చాటుపద్యమణిమంజరి

ద్వితీయభాగము

ఆకుగ్రంథములనుండి ముఖ్యదపరిశ్రమ చేసి యాంధ్రదేశ మన్నిభాగముల నుండియు కమ్మనైనపలుకంటి చాటుధారలను సంపాదించి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీనిని వెలయించినారు. ప్రథమభాగమున లేని యపూర్వవిషయములు గలిగి యిది యుపయుక్తముగానున్నది. వెల 1-8-0. గ్లేజు పేపరు ప్రతి 1-10-0

# మూన్నాళ్ల ముచ్చట

హృద్యమగు చిన్న పద్యప్రబంధము, ప్రభాకర శాస్త్రి గారు రచించినది. పద్యము లమృతగుళికలవంటివి. కథయీనాటి యాంధ్రదేశపుది. దీనితో నిండినది. వెల 0—6—0.

రెంటికిని ఒకేసారి ఆర్డరు పంపువారికి మూన్నాళ్ల ముచ్చట రూ. 0-4-0 లకే పంపబడును.

విలాసము:— మణిమంజరి మేనేజరు, తిరువల్లిక్కేణి,

మద్రాసు.

శ్రీ సింహపురి సత్యాగ్రహస్టోరు, నెల్లూరు.

# మైకాచిమ్నీలు.

ఈ చిమ్నీలు మావల్ల తయారుచేయబడుచున్నవి. యీ చిమ్నీలు గ్లాసుచిమ్నీలవలె క్రిందపడినను కాంతి జాస్తి అయినను నీరు పడినను పగులవు. చాలా కాంతిగా వుండును. కండ్లకు చల్లదనముగా వుండును. చాలాకాలము పనిచేయు యీ మైకా చిమ్నీలను అనేకులు వాడుకొనుచున్నారు.

ధరలు:— నెం 10 రు లాంపు మైకాచిమ్నీ 1-కి రు 0-12-0 నెం 14 రు లాంపు మైకాచిమ్నీ 1-కి రు 1-0-0, డీట్సు చేలాంద్రచిమ్నీ 1-కి రు 1-0-0, కొవ్వొత్తిస్టాండుచిమ్నీ 1-కి రు 0-12-0, ¾ అంచి గోడలాంపుచిమ్నీ 1-కి రు 0-8-0, నెం 5 రు గోడలాంపుచిమ్నీ 1-కి 0-6-0. పోస్టేజి వేరు.

కాఫిబిళ్లలు:—పాలు చక్కెర కాఫిపొడితో అవసరము లేదు. ఒకకప్ వేడినీళ్లలో ఒకబిళ్ల కరిగించిన శుభ్రమైన కాపి త్రాగుటకు సిద్ధముగా నుండును. ఆఫీసర్లకు, ట్రావిలింగు పోవువారికిది చాలా అనుకూలము. 24 బిళ్లలు ప్యాకి రూ 1-4-0.

వరా:—వ్యాపారులకు మొత్తముగా ఖరీదుచేయువారికి కమీషను ధారాళముగా యివ్వబడును. అడ్వాన్సు లేని ఆర్డరును అంగీకరింపబడదు. పోస్టుఖర్చులు ప్రత్యేకము.

D. Krishniah Gupta, Managing Proprictor.




# అమృతాంజనము

తలనొప్పులకు ప్రసిద్ధి కెక్కినది ఇతర ఏ విధమైన నొప్పులను కూడ మా అమృతాంజనము వాడినంత మాత్రమున నయమగును. వెల 0-10-0 అణాలు పంచభావ. దీనికి మారుకొనిన మోసము గలుగదు

# దంతచూర్ణము

వెల డబ్బీ 1-కి 0—2—0

ఈ దంతచూర్ణముతో పండ్లతోముటవలన చిగుళ్లనుండి రక్తము స్రవించకుండును. నోట దుర్గంధము లేక యుండును.

# తామరతైలము

తామర, తీట, గజ్జికి మంచి మందు.

డబ్బీ 1-కి 0-6-0 ఆరుఅణాలు మాత్రమే.

అమృతాంజనం డిపో, బొంబాయి లేక మద్రాసు.

# తిక్కన కవిత్వము

## భోగరాజు నారాయణమూర్తిగారు

నన్నయ తరువాత వాని కవితామార్గము ననుసరించి వానికిఁ బ్రతిశోభ గలిగించిన మహనీయుఁడు తిక్కన యని చెప్పుటకుఁ జిక్కనికథ కల్పింపఁబడినది. "తన కంకితముగా నాంధ్రీకరింపఁ బ్రారంభించిన భారతమును బరిసమాప్తి నొందింపకయే నన్నయభట్టు మృతినొందినందునఁ జింతాక్రాంతుఁడై రాజరాజనరేంద్రుఁడు గాని సెట్టులైన సాంతముచేయింపవలె నని బహుప్రయత్నములు చేసి పండితులను రావించి చూడఁగా వారెవ్వరును దినమహాకార్యమునకు సమర్థులు గారైరట! నిర్వచనోత్తరరామాయణమునకే ప్రసిద్ధినొందిన యొక యాంధ్రకవీంద్రుఁడు నెల్లూరియందుండె ననియు నతనివలన గ్రంథపరిసమాప్తి కాఁగల దనియు విని పండితుల యనుమతిమీఁద సభాపర్వములోని—

మ. మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొనితెచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచల సేతుశీతనగ మధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్.

అను పద్యమును తాటాకులమీఁదఁ బ్రతులు వ్రాసి దానితో సమానమైన పద్యమును వ్రాయుఁడని తక్కిన రాజాస్థానములయందలి పండితులకును సిద్ధిరాజుసభయందున్న తిక్కనకును గూడఁ బంపినట్లును, మిగిలినవారందఱును తమకుఁ దోఁచిన పద్యములను వ్రాసి పంపఁగా తిక్కనమాత్ర మట్లు చేయక తానాపద్యమునే మఱల మఱియొక తాటాకుమీఁద వ్రాసి దానికి వర్ణము వేసి పంపినట్లును, రాజరాజనరేంద్రుఁడు మిగిలినకవులపద్యముల నన్నిఁటిని జదివి వానిలో నేదియు నన్నయపద్యముతో సరికాకపోయినందున వానిని నిరాకరించి, తాను రచింపఁబోవు గ్రంథము నన్నయభట్టారకుని కవిత్వమువలెనే యుండినను దనయంతకంటె మెఱుఁగుగా నుండు నని సూచించుటకై తిక్కన యట్లు చేసె నని గ్రహించి యాతని బిలిపించినట్లును గ్రంథరచనకుఁ బూర్వముం దాతనిచేత గౌతమీతటమున యజ్ఞముచేయించి భారతము సంపూర్ణము చేయించినట్లును జెప్పుదురు. మఱికొంద ఱట్లు పంపఁబడిన పద్యము, ఆదిపర్వములోని యీ క్రిందిపద్యమని చెప్పుదురు

ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము. జగన్నుత! విప్రులయందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము. గావున విప్రుఁ డోపు; నో
పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్.

చూ. ఆంధ్రకవులచరిత్ర.

తిక్కన కాలమునాఁటి సందర్భములకు సరిపోలింపఁబడిన యీకథ కల్పితమైనను గవుల ప్రజల మతభేదములను సూచించుటకుఁ బ్రస్తుతము మన కుపయోగింపఁబడుచున్నది. రాజరాజు రాజాస్థానపండితులకుఁ బంపించిన పద్యము మొదటిపద్యమని కొందఱును రెండవపద్యమని కొందఱును జనులు చెప్పుకొనుచుండి రనుటయందుఁ దగినంత భాగము లేకపోలేదు. మొదటిపద్యమునందలి 'లసత్. ఓలిన్ - కొని తెచ్చి - యిచ్చి - ముదమొప్పం గాంచి' - యనుపదములు లెక్కింపఁదగినంత భావవ్యక్తీకరణములు గాక, చెక్కుడుపలుకులతోఁ బాదపూరణమునకై ప్రయోగింపఁబడిన వనియు, ఆపద్యమున నన్నయ వర్ణింపఁదలంచిన విషయము—

మ. మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొనితెచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించిరి

అను రెండుపాదములలోనే, కర్తృకర్మపదవిశిష్టముగ ముగించె ననియు, నందుచే మూఁడవపాదమునందు,—

"అయ్యుదయాస్తాచల సేతుశీతనగ మధ్యోర్వీపతుల్"

అను కర్తృపదమును సాధ్యమైనంతవరకు పొడిగించి తక్కినభాగమును

"సంతతా। భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోదయున్."

అని ధర్మజునివిశేషణములతోఁ బూరించె ననియు, ద్వితీయపద్యపక్షము వారు విమర్శించి యట్టి విమర్శకవకాశము లేని 'నిండుమనంబు' అను రెండవపద్యమును దైర్యకథ కాధారముగఁ జెప్పియుందు రని మన మనుకొనవచ్చును. దైవిపక్షయందలి యుక్తాయుక్తము లెట్లున్నను భిన్నవాదములకు మాత్ర మీ రెండు పద్యములును నాధారములు కాకపోవు. ఇందలి మొదటిపద్యము బహుళసంస్కృతపదాలంకృతము. రెండవది బహుళాంధ్రపదోపేతము. మొదటిదానియందలి గుణము శబ్దగాంభీర్యము. రెండవదానియందలి గుణ మర్థగాంభీర్యము. మొదటిది నిరర్థకపదాధారకమును, రెండవది సార్థకపదగుంఫనమును దృష్టాంతములు. మాధుర్యము మాత్రము రెండిటియందును సమమే.

ఇట్టి రెండుపద్యములయందలి భేదములనుబట్టి భిన్నవాదులైన నాఁటిజనులలోని రుచిభేదములను మనము సూక్ష్మముగా విభాగించుకొనవచ్చును. కల్పితకథ గూర్చి యింతకన్నఁ జర్చింపవలసినది లేదు. నన్నయ మొదటిపద్యమునందలి నిరర్థకపదాధారతో నేకీభవించి రెండవపద్యమునందలి కవితాగుణము లన్నియుఁ దిక్కనరచనయందుఁ గాఁడఁబడుచుండు నని చెప్పుటయే దీని పర్యవసానము.

అది యెట్లుండెనో—

"క. కనుల కవిత్రయ నిర్మిత
సమధిక రసవత్ప్రబంధ సాహిత్యకళా
సుకర స్రవంతి కల్లో
లముల౯........................"

అని శంకరకవి చెప్పినట్లు కవిత్రయముగారి కవితాధార నిరుపమానమైన ప్రవాహము. ఆప్రవాహవేగమున సందర్భ చిన్నచిన్న నలుసు లుండిన నుండవచ్చును. అంతమాత్రమున జగత్ప్రఖ్యాతమును బుధ మనోజ్ఞమును నగు సద్ధానికిం గొఱంత వాటిల్లదు.

నన్నయ కవితామృతమును బలె రచనం బట్టి తిక్కనకవితామృత మును వెదకవలసిన యవసరము కవనకు లేకుండ నతఁడు తన యభిప్రా యమును స్పష్టముగ వెల్లడించెను. ఇందులకుఁ గారణము వాని స్వాతం త్ర్యమే. ఇంతటిస్వాతంత్ర్యము నన్నయ కున్నట్లు కనఁబడదు. నిర్వచ నోత్తరరామాయణ రచనాసందర్భమునఁ దిక్కనః—

మ॥ అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడన్ గళావిదుఁడ................."

అని స్వకవితాసామర్థ్యమును జెప్పుకొనుచోఁ గవిత్వము శిల్ప మని చెప్పెను. కేయూరబాహుచరిత్ర కర్తయైన మంచనయుఁ దన కృతిపతి తన్నుం గోరినట్లుగ—

క. కేయూరబాహుచరితము
సేయుము నీ వాంధ్రభాష శిల్పము మెఱయ౯

అని యీవిషయమునే యుగ్గడించెను. మఱియుఁ గావ్యనిర్మాణమునకుఁ బూనుకొనిన కవి ముఖ్యముగ గమనింపవలసిన విషయములను దిక్కన యీక్రిందివిధమున వెల్లడించెను.

ఉ. భూరివివేకచిత్తులకుఁ బోలునన న్దలపన్ దళంబులన్
సౌరభమిచ్చు గంధవహుచందమునం బ్రకటంబుచేసి యిం
పారెడు పల్కులం బడయు నప్పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగాఁ
జేయుట నేర్పుగా వలయుఁ జేసెద నేఁ గృతి యన్నవారికిన్"

క. తెలుఁగు కవిత్వము చెప్పం
దలఁచినకవి యర్థమునకుఁ దగియుండెడు మా
టలఁ గొని వళులుం బ్రాసం
బులు నిలుపక యొగిని బులిమిపుచ్చుట చదురే?

క. అలవడ సంస్కృతశబ్దము
తెలుఁగుబడి విశేషణంబు తేటపడంగాఁ
బలుకు నెడ లింగవచనం
బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్.

నన్నయకావ్యరచన ముగిసిన తరువాతఁ దిక్కన కావ్యరచన ప్రారంభించుకాలమును గల మధ్యకాలమున రచింపఁబడిన గ్రంథము లలో నన్నెచోడుని కుమారసంభవమును భాస్కరుని రామాయణమును ముఖ్యమైనవి. అందుఁ గుమారసంభవమునుగూర్చి మొన్నమొన్నటి వఱకు నాంధ్రదేశ మెఱుఁగనేయెఱుఁగదు. భాస్కరరామాయణము మాత్ర మీనాఁడువలెనే యానాఁడుసైతము నత్యంతజనాదరణము వహించియుండె నని దాని నిలుకడయే చెప్పక చెప్పుచున్నయది. మఱి యు నట్టిజనాదరణము, నాఁడా గ్రంథమునకు లేకుండ నుండినయెడల ఆకావ్యమునందలి రచనావైదుష్యమునఁ దనకు గౌరవభావము లేక యుండినయెడలఁ, దిక్కన యీక్రిందిపద్యమును జెప్పియుండఁడు.

* గీ. సారకవితాభిరాము గుంటూరువిభుని
మంత్రిభాస్కరు మత్పితామహునిఁ దలఁచి
యైన మన్నన మెయి లోక మాదరించు
వేఱ నాకృతిగుణములు వేయు నేల?

చంద్రునియందలికాంతియుఁ బుష్పమునందలి సుగంధమును గావ్యమందలిఘనతయుఁ జేతులకుదొరకనివి. దాచిపెట్టుటకునీలులేనివి. కావున ననివారణమైన విపరీతకారణ మేదైనఁ దటస్థింపకున్నంతవఱకు నుత్తమకావ్య మెప్పటికిని మఱుఁగుపడనేరదు. అట్టికారణము లేకయే యొకానొకగ్రంథ మడుగంటిపోయినయెడల దానికి నేరుపు తక్కువ లేదా ప్రాశస్త్యలోపమనియే చెప్పవచ్చును. గ్రంథమునకుఁ గలుగు సత్యాం తజనాదరణమే తత్ప్రాశస్త్య మని నామనవి.

తిక్కన తనకాలమునాఁటికవులను నిర్వచనోత్తరరామాయణమునందలి మంచిచెడ్డ లెఱుంగుచుండినవాఁ డగుటచేతను, అప్పటికి కించుమించుగ నిన్నూఱేండ్లక్రిందట రచింపఁబడిన నన్నయభారతభాగము లానాఁటి జనసామాన్యముచే నెట్లాదరింపఁబడుచుండెనో తాను గన్నులారఁ జూచుచుండినవాఁ డగుటచేతను, తన తాతగారైన భాస్కరుఁడు రచించిన రామాయణము సైతము నన్నయకావ్యమువలెనే క్రమక్రమ ముగ నన్నివైపుల వ్యాప్తమగుచుండుటఁ గనిపెట్టుచుండినవాఁ డగుట చేతను, కావ్యనిర్మాణమునకై పూనుకొనిన కవి యన్నిలక్షణముల కన్నను జనాదరణము ముఖ్యలక్షణముగా గమనింపవలసిన దని యొక సూత్రము నేర్పఱచుకొనెను. కవిత్వ మిట్లుండవలయు నని నైపథ్యము లయం దాతఁడు చెప్పినరీతు లన్నియు నీసూత్రము ననుసరించినవియే యున్నవి. మఱియుఁ దననాఁడు జనప్రచారమునందు లేక కేవలము ప్రాతవడినమాటలు పేర్చి కొందఱు కవులు వ్రాయుచుండిరనియు, నందువలన జనసామాన్యమునకు రుచింపక పోవుచుండెననియుఁ, దిక్కన యొనర్చిన కుకవినిందవలన మనకుఁ దెలియవచ్చుచున్నది.

చ. పలుకుల పొందు లేక రసభంగము సేయుచుఁ బ్రాఁతపడ్డమా
టలఁ దమ నేర్పు చూపి యొకటన్ హృదయం బలరింపలేక, యే
పొలమును గానియట్టి క్రమముం దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁ బొరయంజరించు కుకవుల్ భువి దుర్విటులట్లు చూడఁగన్

నైపథ్యమునందుఁ దిక్కన యొనర్చిన యాక్షేపణము నన్నెచో డున కన్వయించునేమో యని కొందఱియుద్దేశము. నన్నెచోడుని

---

* రామాయణకృతికర్త యీమంత్రిభాస్కరుఁడు కాఁడని యొక వాదమున్నది.

రచనయందలి ప్రాంతమాటలు నేఁటివారికే కాక నాఁటివారికి సైతము దుర్గ్రాహ్యములై యుండవచ్చును. ఆవిషయముఁ బండితులొనర్చెడు విమర్శలను దిక్కన ప్రత్యక్షముగ నెఱింగి-యట్టిపదములను దనకవిత యందు వీలైనంతవఱకుఁ జొరనీయకుండఁ గడుజాగరూకతతోఁ గావ్య రచనఁ గావించెను. స్వతః తృప్తినొందక తాను రచించుచుండిన భాగములు సరసులైన వారి కప్పుడప్పుడు వినిపించుచు వారి సమ్మతి వడయుచుండెనని యనుకొనుటకీ క్రిందిపద్య మవకాశము కలిగించు చున్నది.

గీ. ఎట్టికవికైనఁ దనకృతి యింపుఁ బెంపఁ
జాలఁ గావునఁ గావ్యంబు సరసులైన
కవులచెవులకు నెక్కఁగాని నమ్మఁ
డెందుఁ బరిణతి గలుగు కవీశ్వరుండు.

జాతీయపదప్రయోగమునందును యతిప్రాసనేర్పునందును గవి బ్రహ్మకుఁ గల కౌశలము తెనుఁగుకవులలో వఱియొకరికిలేదు. అదుబగసామర్థ్యయతు లన్నఁ దిక్కనకు మక్కువ. ఎక్కువ విపులమైన భావమును గొలఁదిపదములలో నుడువుట అతనికలములయం దాచార మగుటచే సందెండఁ గొన్నిపద్యములయం దన్వయము కొంచెము కష్ట ముగా నుండినను నారికేళపాకమును జొరనీక యతఁడు తనకవితకు సహజమైన ద్రాక్షాపాకమును నాద్యంతము నొక్కరీతిఁ బోషించుట యెంతయు శ్లాఘనీయము. ఈయంశమునే మనసునం దిడుకొని చదలు వాడ మల్లయ తిక్కనకవి నిట్లు స్తుతముచేసెను.

"క. ప్రాకట నవరస కలనా
సాకల్యము మెఱయు మధురసమధుద్రాక్షా
పాకప్రబంధరచనన్
జోకం దగు తిక్కయజ్వ జూతుం దలఁతున్."

ఇట్లు కొలఁదిపదములలో గొప్పభావమును వెల్లడించుట నన్నయ కవితకుఁ దిక్కన వన్నెపెట్టె నని జనులు చెప్పుకొనుటకుఁ గారణ మైన గుణములలో నొకగుణమై యుండవచ్చును. మఱియు—

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా †కవితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప..."

అను నన్నయసూత్రమును దిక్కనయు ననుసరించి, ప్రసన్న కథాకవితార్థయుక్తికొఱకే ప్రయత్నించెను. గాని, కవితాతత్త్వజ్ఞు లంతగా సమ్మతింపని శబ్దాలంకారములకుఁ బ్రయోగాసపడలేదు. తాతగారికవితయందుఁ దనకుఁగల గౌరవభావమును వెల్లడించుటకుఁగాఁబోలు నిర్వచనోత్తరరామాయణమునందు మాత్ర మచ్చటచ్చట భాస్కరుని శబ్దవైచిత్ర్యము నించుక చూపుచు వచ్చెను. అరవంత శబ్దవైచిత్ర్య మైనను పద్యాంతములయందు మాత్రమే చేర్చుచు వచ్చుటచేత నతఁడు కేవలము నర్థాలంకారప్రియుఁ డని నిశ్చయ మగుచున్నది. చూడుడు.

ఉ. పాటిత దుష్టసత్త్వ వనవాటిక నిద్ధబలావరుద్ధశృం
గాటక గ్రంథిలభ్రుకుటిగాఢలలాటకుఁ, గ్రూరతారకా
నాటక వాంత్రకాంచిపరిణద్ధ కళప్రభవ త్రికమిస్ఫుటా
కీటక రక్తసిక్తపటుఖేటకుఁ దాటకఁ గాంచి రయ్యెడన్. భా. రా.

శా. కోపంబారినఁ జంకవాపి ధరణిం గూర్చుండఁగాఁ బెట్టి ని
ష్పాపోల్లాసకటాక్ష మల్లనొలయన్ బ్రాసస్మితజ్యోత్స్నల
జ్జాపూరావృత తన్ముఖాబ్జములపై సాంద్రంబుగాఁ జూపి ని
ర్వ్యాపారామరసుందరీప్రకరగర్భస్రావణున్ రావణున్.

ఉ. ఈ యనుమాన మేటికి నరేశ్వర! భూపరిపాలనక్రియా
పాయము ధర్మనిష్ఠయుఁ గృపాగుణమున్ వినయంబు పెంపునున్
న్యాయవిశోధనంబును నియంత్రితసత్యవచోవిలాసమున్
బాయక యిందు నెందు నరిభంజన సూరిజనానురంజనా! నిర్వ. రామా.

అర్థాలంకారప్రియుఁ డగుటయే కాక, అతిశయోక్త్యుత్ప్రేక్షోల్లేఖాద్యలంకారము లన్నింటికంటె స్వభావోక్తియే తిక్కనకు మిక్కిలి యభిమాన మని వాని రచనలను వర్ణనలను బట్టి తోఁచుచున్నది.

సీ. తీగెయుయ్యాలలెక్కి తూఁగియాడుచుఁ గూడి
పాడెడు పుత్త్రికాబాలికలను,
పలుకులు తోడన యలనడఁ దొడఁగియు
నేరని కీరకుమారికలను,
నింపారు తేఁదూఁడు లేరి పిల్లలకుఁ బె
ట్టుచు నున్న హంసకుటుంబినులను,
ఫలరస మొండొంటి కెలమిఁ జుంచులనిచ్చు
ఱేఁ దొరక్క కోకిలదంపతులను
జూచిచూచి యొండొరులకుఁ జూపిచూపి
వెలఁదికెఱిఁగించి కొనియాడి చెప్పి చెప్పి
చిత్తహారి విహార సంసేవ నగలి
యుల్లసిల్లిరి వనితయును వల్లభుండు.
'నిర్వ. రామా.

ఇట్లు విమర్శించినకొలఁదిని దిక్కనకవితయందలి గుణములు వేన వేలుగఁ దోఁచుచుండును. "అమలోదాత్తమనీష..." అనుపద్యమునం దుఁ గవిత్వము శిల్పమని చెప్పుటయే గాక, కవులను గూర్చి చెప్పినప ద్యములలో "రసపారగుల కల్కికలన్" అనియు, "సరసమధురవచోగుంఫన" అనియు "లలి పదవ్యాప్తసద్యంబుల" అనియుఁ దఱుచుగాఁ బద ములయందలి మాధుర్యమును గూర్చియే నొక్కిచెప్పుచు వచ్చుటచేత సంగీతమునకుఁ గవిత్వముసైతమును శ్రవణసుఖమును మాధుర్యమును బుట్టించుచుండుట వానిమతముగాఁ దోఁచుచున్నది. ఇట్లు సంగీతచిత్రలేఖ నములు రెండును గవితయందుఁ బొందుపడియుండవలె నను తిక్కనమ తము-కోలరిడ్జి-కీట్సు-షెల్లీ-మొదలగు కొందఱు ఆంగ్లకవితాతత్త్వవేదు లమతములతో నేకీభవించుచున్నది. ఈవిషయమును "జేమ్సు, హెన్రీలేనాంట్" అనునాతఁడు విపులముగా నిరూపించియున్నాడు.

† కలితార్థయుక్తి-అనిపాఠాంతరము.

లో బాలవ్యాకరణము చెప్పుచున్నది. ఈ బాలలాక్షణికుల కీబాలవ్యాకరణమే కదా ముఖ్యప్రమాణము! సంస్కృతముపోలికను బట్టియే ఐ ఔ లకు, వృద్ధిసంజ్ఞ నంగీకరించుకొనినప్పుడు హ్రస్వము లగు ఎ ఒ లకును దెనుగునఁగూడ సంస్కృతము పోలికను బట్టియే గుణసంజ్ఞ నేల యంగీకరించుకొనరాదు? హ్రస్వములు దీర్ఘముల ప్రతిరూపములే. ఛందస్సు లట్లు చెప్పలే దన్నచో, నది వానిదోషమా? ప్రయోగించిన విద్వత్కవులదోషమా? ఆ ఒ లకు ప్రాచీనమహాకవుల ప్రయోగములలో విశ్రమము గాన్పించుచుండ దానిం జూచి పిమ్మటిఛందస్సు లన్నియు, గతానుగతికముగా నది లుప్తవిసర్గకోత్వ విరామ మని చెప్పుచున్నవి. కాని మహాకవుల యభిప్రాయము నట్లనినట్లు గానరాదు. అచ్చట - లుప్తవిసర్గక మనునది బహువ్రీహిసమాసమును నదీవిశేషణమును గదా? దేనికి ఓకారమునకా? ఉత్వమునకా? వీరికాభేదము లేదు కాఁబోలు! అచట విసర్గము లోపించినచో నుకారము దేనికివచ్చును. ఇట్టి యభిప్రాయముతోనే కృతికర్తలా ప్రయోగమును చేసినయెడల వారు వ్యాకరణశాస్త్రజ్ఞానము లేనివారేకాక తుదకు ధర్మమర్మభావమునుగూడ నెఱుఁగనివా రనవలసివచ్చును. అది యిష్టాపత్తి యన్నచోఁ దమదోషమును వారియందుఁ బెట్టు సాహసిత్వమే వీరికి సిద్ధించుగాని యభీష్టము సిద్ధింపదు. ఇది యెట్లున్న దనఁగా నిప్పుడు మనలో - నిత్యోపాసన మన్తరించినది. దానిని ప్రత్యాబ్దికము రోజున పురోహితుఁడు యజమానునిచేఁ జేయించి వానిచుం దగ్నౌకరణమును జేయించుచున్నాఁడు. దానినిజూచి యీ యౌపాసనము సాబ్దికమురోజుననే కాని యితరకాలమునందుఁ జేయరా దని ధర్మసూత్ర మేర్పడిన దట్లుండునో ఈలుప్త విసర్గకోత్వవిరామలక్షణముకూడ నట్టిదిగానే కాన్పించుచున్నది. ఇప్పుడు లోకమున భాషాభిమానులు గొందఱు “ఆంధ్రభాషాభివర్ధనీసమాజ” మను పేర నొకసమాజమును స్థాపింప నింకొకరును భాషాభివర్ధనీసమాజము నే స్థాపించుచున్నాఁడు. దానిఁ జూచి మఱియొకరును భాషాభివర్ధనీసమాజ మనియే స్థాపించుచున్నారు. దానిం జూచి కొందఱు అనురంజనీ, అనుమోదినీ, ఆమోదినీ, విలాసినీ అను పేర్లతోనే స్థాపింతురు. ఆసామాజికు లెవ్వరో? తెలియఁదగదు. ఈనాఁడీ సమాజము లెట్లు విలసిల్లుచున్నవో యానాఁ డా లక్షణములుగూడ నట్లే విలసిల్లుచుండును.

“అనియమా ద్గ్రామ్యంహి యుక్త్యపభ్రంశః” అని చిన్తామణిలో - నన్నయభట్టుకు నియమములేని యపభ్రంశము శాబ్దగ్రామ్య మనియు, నది నియమపూర్వక మయినచోఁ గ్రామ్యమే యనియు, గసడదవాదేశ సంస్కారమును చెప్పి, వాఁడు సేసె, ఇత్యాదులు సాధువులుగానే - తనభారతమందు ప్రయోగించియున్నాఁడు. ఈనియమము, గ్రామ్యముల శోధనముకొఱకే యయినట్లు భట్టారకుని యభిప్రాయముగా గానఁబడుచున్నది. మఱియు - కఱకంఠాదులకు గ్రామ్యత్వమే లేనట్లు సమాసపరిచ్ఛేదమందు మిశ్రసమాసము నంగీకరించియున్నాఁడు. ఇట్లుండగాఁ - బిమ్మటి వారిలో ద్వితీయాచార్యుఁడు కఱకంఠముఖాహితా అని వానిని సమ్మతములుగానే చెప్పినాఁడు. కాని గ్రామ్యములుగాఁ జెప్పలేదు. పంచాయము, తోపించాయము, మున్నగునవి గ్రామ్యము లన్నాఁడు. అందును కఱకంఠాదులు లేవు. సీతారామాచార్యులు కఱకంఠశబ్దముఁ గరకంఠశబ్దతద్భవ మనియుఁ బ్రాణగొడ్డము ప్రాణపుట్టతద్భవ మనియు - గ్రామ్యములు కావనియు ననిరి. కాని కపిలకన్నులు కపిలగడ్డము జనవెన్నము - వీనికి సవరణఁ జేయలేదు.

అప్పకవి “లక్షణరహితకావ్యము వర్ణలోప మొంది చులకగా గ్రామ్యజనులు పలుకు - “వస్తాఁడు, తెస్తాఁడు” మొదలగునవి యపభ్రంశ గ్రామ్యము లగునని చెప్పినాఁడు.

చిన్నయసూరి తనబాలవ్యాకరణమందు “లక్షణవిరుద్ధం బగు భాష గ్రామ్యంబు” [౨౭ సూ] అని చెప్పి ‘వస్తాఁడు తెస్తాఁడు’ మొదలగువానిలో ‘కఱకంఠుడు ప్రాణగడ్డము జవగత్తె కపిలకన్నులు కపిలగడ్డము కపిజడలును’ గ్రామ్యములుగాఁ జేర్చి “ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు” [౨౩] అనివ్యాఖ్యానములో పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయినను గ్రహింపందగు నని భారతకర్తల ననుగ్రహించినట్లు చెప్పినాఁడు. లక్షణమున నెద్దియో చెప్పలేదు. దానికి శాస్త్రమున్నచోఁ గఱకంఠాదు లేశాస్త్రమునకు విరుద్ధములు? ప్రథమాచార్యుఁడు చిన్తామణిలో మిశ్రసమాసములను సాధించియుండ నవి శాస్త్రవిరుద్ధము లెట్లు? బాలవ్యాకరణ మన షష్ఠీసమాసమా? కర్మధారయమా? మొదటిపక్షమున బాలునివ్యాకరణము, లేక బాలురకు (కొఱకు) నైన వ్యాకరణ, మని కదా చెప్పవలయును. అప్పుడు కన్నఁ బెఱచియుఁ దెలుఁగయు నున్నవారి దని లేక యట్టివారికొఱకైన దనియును సిద్ధించును. ఇఁకను రెండవపక్షమున నీ వ్యాకరణమే యట్టి బాల్యదశలో నుండి వృద్ధుల నాక్షేపించుట యిప్పటి కాలధర్మమే కావలయును.

చిన్తామణిలో నన్నయభట్టు సాంస్కృతిక పదములలోని క చ ట త ప లకు, గ స డ ద వాదేశము గాని సరళాదేశము గాని చేయరా' దని చెప్పియుండ, నిప్పటివా రెల్లెడల, విచ్చలువిడిగా నిష్టమైనట్లు చేయుచున్నారు. ఇచట చిన్నయసూరి “ తెనుగుమీఁది సాంస్కృతికపరుషములకు గ స డ ద వ లు రావు [౧౪ సంధిసూ] అని చెప్పినాఁడు. సంస్కృతమునఁ బరుష వ్యవహారమున్నదా? పరుష మను వార్తనే యెఱుఁగని సాంస్కృతిక పదములలోఁ బరుష సంజ్ఞికము లుండునా? సంజ్ఞయే లేక, సంజ్ఞాకార్య మెట్లు సిద్ధించును? ఈ నిర్వచనము గగనారవిందము భౌమారవిందమువలె, రాత్రి ముకుళింపదు అనున ట్లున్నది. ఇచట గొందఱు తెనుగుమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు. కాని సాంస్కృతికములమీఁదివానికి రావచ్చును. అని వ్యాఖ్యానము జేయుచున్నారు. ఆవ్యాఖ్యానము నట్టిదే. “ నవికృ శబ్దా త్పరుషాః సాంస్కృతికానాం భవన్తి గసడదవాః ” అని చిన్తామణి సూత్రములోని ‘వికృతిపదాత్’ అనునది అధికారప్రాప్తమే కాని సాంస్కృతికపదములలో సిద్ధించుటకైన ప్రతిప్రసవము గాదు. గసడదవ, సరళాదేశములు రెంటికిని పూర్వపరనిమిత్తములు రెండును వైకృతములే యయి యుండవలయు

VIZAGAPATAM MEDICAL STUDENTS



విశాఖపట్టణము వైద్యవిద్యార్థులు

THE LADY GRADUATES



యువతీస్నాతకలు

THE HINDI VIDYAPEETA, PRAYAG



హిందీ విద్యాపీఠము, ప్రయాగ

RAJAMANDRY HINDI PRACHARAK SANGAM



రాజమహేంద్రవర హిందీ ప్రచారక సంఘము

# కవిత్వ తత్త్వము

కవికొండల వేంకటరావు గారు

తత్త్వము అనుపదము ఎచ్చటవచ్చినను మిగుల దుర్జ్ఞేయమైన పదము. "శరీరతత్త్వము" అని వాడుదుము. "శరీరము" అనుమాట సులభము. శరీరమును చూచుట-దానిరూపురేఖలనుఁ గొనియాడుట-దానిని చక్కగదిద్దుట - ఇదియెల్ల సులభము. కాని శరీరతత్త్వమును గమనించుట దుష్కరము. "వేదాంతతత్త్వము" అని మనము వాడుదుము. వేదాంత మనుమాట సులభము. వేదాంతప్రసంగము వినుట-వేదాంతోపదేశములను బొందుట - వేదాంతులతో కలసితిరుగుట - ఇదియెల్ల సులభము. కాని వేదాంత తత్త్వమును గ్రహించుటమాత్రము దుష్కరము.

అట్లే కవిత్వమును కవిత్వతత్త్వమును. మన మొక కావ్యమును రసవంతముగ-రాగప్రసనులతో- అనాయాసముగఁ జదువఁగలము. కాని ఆ కావ్యమందలి తత్త్వమును బోధచేసికొనుటయన్న ప్రయాసము. అట్లని తత్త్వవిచారణమును విడువరాదు.

తత్త్వము అనుమాట సర్వసామాన్యముగ మనము వాడుకొనునదియే! అందున వింతలేదు. దానిని శరీరపదముతో జతపఱచిన స్వభావమని యర్థమును జెప్పుకొనుచున్నాము. దానిని వేదాంతముతో జోడించిన పరమాత్మఅని అర్థము చెప్పుకొనుచున్నాము. దానినే ముక్కలుముక్కగ విడదీసి-తత్=అది, త్వం=నీవు. అని ప్రతిపదార్థమును చెప్పుకొనుచున్నాము. కాని కవిత్వతత్త్వ మనుపదము క్రొంగ్రొత్తపదము. అయ్యది ఆధునిక విమర్శనాసందర్భమున నుత్పన్నమైనది.

కవిత్వమునకు స్వభావ మున్నదా? "బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్" అని మహాకవి యగు పోతన కవిత్వమును తీయమామిడిగున్నయొక్క క్రొంజివురుటాకంత కోమలమైన దానినిగ వర్ణించియున్నాడు. ఆంధ్రకవితాపితామహుఁడగు అల్లసాని పెద్దనార్యుడును ఇట్టులనే కవితను మిక్కిలి సున్నితమైన దానినిగ వర్ణించియున్నాడు. పింగళిసూరనామాత్యుఁడు "పలుకనేర్చుట బహుతపఃఫలముగాదె" అని కవిత్వమును పూర్వజన్మవాసనాసంసిద్ధముగ సూచించియున్నాడు. కాళిదాసు "మందః కవియశః ప్రార్థీ" అనుచుఁ గవిత్వమును ఎత్తైన చెట్టు కొట్టకొన కొమ్మను పండియుండి పొట్టివాని కందని ఫలమువలె దుర్లభమైనదానినిగ నుపమించి యున్నాడు. షేక్స్పియర్-స్థానికవర్ణనమును స్థానికస్మృతిని కొడకూర్చుదానినిగ నిరూపించియున్నాడు. మిల్టను స్వర్లోకవాసినినిగ నావాహనచేసియున్నాడు. వర్డ్స్వర్తు "సమస్తపరిజ్ఞానమునకు ప్రాణవాయువనియు, సరళాంతర్గత సారమనియు నిర్వచించి యున్నాడు. మేత్యూ ఆర్నాల్డు "జనవిమర్శన" మని వాడియున్నాడు. కోలురిడ్జి "కళానందము" గొనియాడినాడు. రవీంద్రుఁడు దానినే "అనంతమైన దానినిగను శాశ్వతమైనదానినిగను" కీర్తించియున్నాడు. అరవిందుడు కవిత్వమునే "ఆత్మవిశ్వసందర్శనముగ" హెచ్చరించి యున్నాడు.

ఇట్లు కవిపుంగవులచే వేయినోళ్ల నిరూపితము కాబడిన కవిత్వమునకు స్వభావములేదన నెవ్వరు సాహసింతురు? కవిత్వమునకు స్వభావమున్నది. ఆస్వభావము నొక్కొక్కకవి యొక్కొక్కరీతిగ స్వస్వానుభవగరిమానుగాహన ప్రమాణములకొలంది పొగడియున్నారు. ఒక్క ఉదాహరణము:

ఉ. "శ్రవణోదంచిత కర్ణికారకముతో స్వర్ణాభచేలంబుతో
నవతంసాయిత కేకిపింఛముతో నంభోజధామంబుతో
స్వవశుండై మధురాధరామృతముచే వంశమ్ముఁ బూరించుచున్
ఉవిదా! మాధవుఁ డాలవెంట వనముం దొప్పారెడిన్ జూచితే"

అని పోతనామాత్యుఁడు భక్తిరసప్రబోధ కలితకోమలముగ సూచించియున్నాడు. "ఉవిదా! మాధవుఁ డాలవెంట వనముం దొప్పారెడిన్ జూచితే" అను చరణము-మృదుతరమై-పాఠకుని హృదయము నుద్బోధించుచున్నది. పైనివివరించిన వర్ణనమెల్ల బహుసంశోభాసమంచితమై యున్నయది. "ఓ స్నేహితుడా! కాళ్లకుగజ్జెలును చేతికిచిటితలును బుజమునఁ దంబురయును భజనము సేయుము! అదుగో! దేవుడు" అనిచెప్పుటకును పై పద్యమందలి సారస్యమునకు ఎంతయంతరమున్నదో ప్రతివారికిని గోచరమే. అట్లే "సత్యభామ శ్రీకృష్ణునకు భార్య. ఆమెడ శ్రీకృష్ణుని తన్నినది. తన్నగనే తన్నుతిని అతఁ డానిదకాళ్లు పట్టినాడు" అనుటకును—

శా. "జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునన్
దొలఁగం ద్రోచె లతాంగి. యట్టియఘు నాథుల్ సేమముల్ సేయఁ జే
గలకిం జెందినయట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే!"

[చ. "నను భవదీయ దాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁ బూని తాఁ
చిన యది నాకు మన్ననయ. చెల్వగు నీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్ర కంటకవితానము సోఁకిన నొచ్చునంచు నే
ననియెద. నల్కమానవుకదా! యికనైన నరాళకుంతలా!"]

అనుటకును భేద మెంతకలదో యోచింపుడు. పద్యమందు క్రోధభావ మెంతకోమలముగ వర్ణింపబడినదో చూడుడు. మనుచరిత్రమునందు అల్లసాని పెద్దన మహాకవి చెప్పిన—

ఉ. పూతపసిండిపంటినఁబ్రున్ బరిరించుకులమ్మ నీతికిన్
లేతకదమ్మ, యిత్తెఱఁగు లేమ సురాంగన లెల్ల నిట్టి నీ
చేతకు మెత్తురమ్మ, పనిసేయక తిన్న నిమేను వెన్నెలన్
వేసు గటమ్మ, యింత కనువేములు సెల్లునటమ్మ యింతికిన్"

అనుపద్యమునందలి సున్నితపుభావమును ఆ "నీతికిన్ లేఁగదమ్మ", "తిన్న నిమేను వెన్నెలన్ వేతు గటమ్మ" అనుపదముల సౌకుమార్యమును-నిరుపమానములు గదా!

కవిత్వ మొక్క పద్యమందే యుండదు. అయ్యది గద్యయందు నుండును. పద్యమునందు నుండును. గద్యపద్యాత్మకంబై యుండును. ఉక్తానుక్తమై యుండును. అయ్యది నోరెఱుంగని పసిపిల్లల ముగ్ధావలోకనంబులఁ గన్నెపిల్లల దృశ్యశ్రవ్యంగాఁ జేష్టలను ముదుసళ్లముక్కాలినడకలను సేకరింపఁ జెల్లును. ఇంత విశాలవంతమగు కవిత్వతత్త్వమును గ్రహించుటకు ముఖ్యముగ పాఠకునకు వలయునది యేమియో చూతము?

(1) దృష్టివిభవము: ఇది తొలుదొల్త పాఠకున కుండవలెను. వేశ్యాంగనావిలాసములును వృద్ధంగధిమధిచులును సంకల్పములగునేని, బాలకృష్ణుని మందస్మితవదనమును, కాళిదాసుని కణ్వకుటీరమును రవీంద్రుని గీతాంజలిని నేర్వనేరము. (2) పాఠకునకు ఇంద్రియనిగ్రహము లేక చక్కని యమాయకపుకథయందు అనురాగము వియోగము మిక్కిలి సున్నితముగను కరుణార్ద్రముగను గ్రహింపవలసియున్నప్పుడు పాఠకుడు నీతినిదప్పి "తొత్తుకూతురెట్లు కౌగిలించుకొనుచున్నదో!" అని పరవశుఁడగునేని, అట్టివానిముం దెట్టి కవిత్వమును నిష్ప్రయోజనమే యగును. మఱియును పాఠకునకుండవలసిన మూఁడవగుణము ప్రఫుల్లవ్యక్తి. అతనివ్యక్తి చక్కఁగ వికసించినదై యుండవలెను. సంకుచితమానసులు కవిత్వమును గ్రహింపనేరరు. (4) మఱియును పాఠకునకు వలయునది ఆధ్యాత్మికప్రశాంతి. అదిలేక కేవల లౌకిక సంక్షుభితమానసముతో పఠించునంతకాలము మనకు కవిత్వముయొక్క నిజరూపము గోచరింపదు. అది సంక్షుభితులకు తాత్కాలికపువాసనలఁ బ్రకటించు అత్తరువుల వంటిదగునే గాని పిందెయై కాయై పండై, మఱియొకవృక్షమునకు విత్తనముగ పరివర్తించు పూవులతావిని స్వీకరింపదు. వాని కనంతమైన అవ్యక్తానంద మది యొసంగనేరదు.

మ. చదువన్ భావము భావముట్టిపడుచో సంకీర్తనాశక్తియున్
ముదమే పాఱఁ బరస్పరంబు మదినిన్ ద్రోసాడుకొంచుం దనున్
హృదయానందతరంగజాలముల ముంచెత్తంగనే పాఠకుం
డదిరా యంచు నుతించునో యదియెయౌ సచ్చంపు కావ్యంబుగన్."

# భారతమాతృవిలాపము

మద్దిపట్ల వేంకటరమణయ్య గారు

ప్రాలయక విన్నవించినను నాంగ్లరాజులచే ననాదృతిన్
బడయుటఁ జేసి భారతజనమ్ములు కాంచెడు కష్టజాలముం
దెలిపెద నీకు నీవయినఁ దీర్చెదవే మొఱ యటంచుఁ జక్రవ
ర్తులకును జక్రవర్తి! దయతో వినవే కడముట్ట నీశ్వరా!

మ. కలమాటన్ వెలిపేది నల్వురకుఁ బల్కన్, ధర్మమున్ జేదితోఁ
జెడునో దానినయాచరింపఁ, గరుణం జీవంత స్వాతంత్ర్యముం
గలుగంజేయరయేని మాదొరలు మాఁగల్ గ్రుడ్డులుం గాఁగ మ
మ్ములఁ జేయంగను రాదె యెల్లతగవుల్ వోవంగ? నోయీశ్వరా!

శా. దారిద్ర్యాంబుధిఁ దేలు చారటమునొంచెన్ మాదు దేశంబు, పెన్
భారంబైన భటవ్యయంబును వలగ్నంబందునుం గట్టియ
య్యో! రూపంబును మాఁచఁ జూచెదరు! కుయ్యో! మన్న నాలింపరీ
తీరుం బాలన మెందునైనఁ గలదే? తెల్పంగదే యీశ్వరా!

ఉ. పూవు నలంగకుండ మధువుం గడుపారఁగ షట్పదంబు తా
నేవిధిఁ గ్రోలుచుండు నటులే కొనఁగాఁ బలె సెస్తుఁ బన్నులన్
భూవరుఁ డాత్మలోనఁ బ్రజ నొవ్వకయుండ నటంద్రు; హూణులే
లా విధియింత్రు మాపయిని నగ్గునకగ్గుకుఁ బన్ను లీశ్వరా!

శా. నానానర్థద మెల్లపాపములకుం దా వీసురం ద్రాగుటన్
మానుం డో జనులార యంచు వచియింపం బ్రాజ్ఞ గౌరార! మా
త్మానాథుల్ వలదంటె కాకొదవు నష్టంబంచుఁ బై పెచ్చు మా
పైనేరంబులు మోపి బందెలను ముంపంజూతు రోయీశ్వరా!

మ. అడుగం బెంగద మాపరిశ్రమలు! మా వ్యాపార మెంతేని వె
న్కడుగుం బెట్టెనుగాదె వర్తకులమం చాంగ్లేయు లీభూమిపై
నడుగుం బెట్టినతోడనే యకట! తామవ్వాని మాయింపరేఁ
గడుపుంగూటికి దేవులాడవలెనే కాసంత మే మీశ్వరా!

చ. కఱవులకా విరామమును గానము. మాయిలనేలు నాంగ్లభూ
వరు లరుదెంచి యయ్యెఁగడ వందయు నేఁబదియేఁడు, లప్పుడే
పొరసె మహోగ్రముల్ జనసముత్కరసంతతిభూరిహేతువుల్
కఱవులు డెబ్బదెన్నది. యలంతుల లెక్కడి యేల యీశ్వరా!

ఉ. కోట్లకొలంది ద్రవ్య మిదిగోనని చేతులలోనఁ బెట్టి నా
కెట్లది వెచ్చపెట్టినను నేమియనంగను వీలులేమిచే
గట్లను జెట్లఁ జూచుచును గాలముపుచ్చెదు మాకు సెప్పు డీ
పాట్లు తొలంగి మాధనముపై నధికారము గల్గు నీశ్వరా!

మ. పరదేశంబును బట్టుచందమునఁ గైవారంబు గావింపఁగన్
వరమాతృక్షితి శత్రుపోల్కి నిరసింపం, బ్రజ్ఞగల్గింప నా
యురువిద్యానిలయంబు లుంచినది మాయుర్వీస్థలిన్ భూవరుల్
తెలుపుంగల్గఁగఁ జేయు విద్య తగునే చెప్పంగ మా కీశ్వరా!

మ. కలిగింపంగల దెద్ది మాతృభువిపై గాఢాభిమానం బెదన్
మొలపింపంగల దెద్ది త్వన్మృదుపదాంభోజంబులన్ భక్తి; లోఁ
దలఁపింపగల దెద్ది స్వీయకవినాథక్ష్మాపతీంద్రాదులన్;
వెలయుంగాఁ గల దద్ది మేటిచదువై విశ్వంబునం దీశ్వరా!

ఉ. ఓదనవేళ నాంగలమె; యొక్కెడ నిర్వ్యయహూద వాంగ్లమే;
వేదహితంబుగా జరుపు పెండిలికిం బిలు పాంగ్లభాష నే;
యేదెను నుగ్రబాలను గ్రహించినమాతృసుభాష యుల్లెడన్;
మాదుజనమ్ము చచ్చు నడుమంత్రపు టాంగ్ల పంటున్న నీశ్వరా!

ఉ. ఏయెడఁ బైస ఖర్చుపటిపింపక కక్షుల నేఁడెంచుచున్
న్యాయము చక్కగాని డె ననాదిఁ గ్రాలెడు పేటగ్రామపం
చాయతు; లన్నిఁ గూల్చి వరుసన్ నెలకొల్పిరి యారె! తౌదుకు
మ్మా యని యాంగ్లభూవరుల న్యాయసభావళి నిందు నీశ్వరా!

చ. ఒకపరి బోనులో నడుగు నుంచి యెనందు రయంబు మీఱి పై
టికిఁ జను దేరఁ గల్గెను గడించి ధనంబు వ్యయింపకుండ! న
మ్మక మొనరింపకుండ యడిమాన్యము లెవ్వఁడు గెల్చె వ్యాజ్యముల్?
సుకమును నెమ్మదిం జెఱచెఁ జూ శెడు కోర్టులు వచ్చి యీశ్వరా?

ఉ. పుట్టినభూమియందు సుఖముల్ కఱవౌటను గూలినాలిచేఁ
బొట్టనుబోసికోఁ దలఁచి పూర్వమెఱుంగని కాసిదేశముల్
పట్టి చనంగ మా ప్రజలు వారల వెన్కఁ బిశాచ లట్టు లి
క్కట్టులు కూడఁ బోపలె నె? కట్ట! యిఁక కెట్టులు చత్తుమీశ్వరా!

ఉ. తల్లి మఱుంగుఁ గన్నపుడె తప్పఁగ లే దశుభంబు లన్నచోఁ
దల్లిమఱుంగుఁ బాసి కడుదవ్వుగ నేగినవారు కాంచుపా
ట్లెల్ల వచింపఁగా వలయునే? యకటా! తెలవారి కెంతలో
యెల్లిద మైరి మాజనము లేవఁబు బుర్వులకంటె నీశ్వరా!

ఉ. ఎంతలు తోఁటలున్న మనకే పనివారలు లేకయున్నఁ గా
సంతయు సాగ దేలికల మై మనమే దయమాలి యిట్లు బా
ధింతుమ యేని వీరి కిట దిక్కెవరంచుఁ దలంప గక్కటా
పంత మ దేల హూణులను భారతసంతతి యన్న నీశ్వరా!

శా. ఇండాఁకన్ వినిపించినట్టివయయో! యేపాటి యన్యాయముల్
ముం దే విన్చెడువాని ముందఱను; మాభూపాలదౌష్ట్యమ్ము మి
న్నందెన్ మంగలమందు లాజలకు దీటై లోకమెల్లం దపిం
పం దీవ్రంబును దుస్సహం బగుచు నాపాంచాలమం దీశ్వరా!

చ. ముసుఁగు వెడల్చి వీనులకు ముల్కులవోని దురుక్తులాడు మం;
గసరి మొగంబులం దుమిసి కాంతల బాధలు పెట్టినట్టి బా
లిశుఁడును బాత్రుఁ డౌచు వఱలెన్ నరపాలకృపార్ద్రదృష్టి; కీ
దౌసఁగు మదిం దలంచినను దోఁచునె కంటికి నిద్ర? యీశ్వరా!

శా. ప్రాకంజేసిరి గట్టినేలపయినిన్ వక్షంబులన్ మోపుఁ డం
చే కర్మంబు నెఱుంగనట్టి జనమున్, హీనుం డహీనుండనం
బో కక్యంతము దీర్ఘమా తెఱవునన్ భూమీధవుల్; సభ్యతే
రీకర్మంబును నౌనటందు రెద నూహింపంగ నోయీశ్వరా!

ఉ. పేదఱికంబు వచ్చినను, బీరములావును మాసిపోయినన్
వ్యాధులభీతి హెచ్చినను, నాయువు తగ్గిన నంతకంతకున్,
మాదగు మాన మిందనుక మాయదు గా యని కొంత యూఱటే
మూఁది చరించుచుంటి మిపుడో యది కూడ గతించె నీశ్వరా!

ఉ. శిక్షయొసంగఁ బోరు మముఁ జిక్కులపా లొనరించినట్టి యా
శాత్రుసకర్ములన్; నిరపరాధుల రక్షణసేయఁ బోరు, త
చ్ఛిక్షులఁ బాపుచుం; గతముఁ జిత్తములన్ మఱువుం డటంద్రు మ
మ్మీక్షితిపాలు రెంతయిన నిట్టివిచిత్రము కంటె! యీశ్వరా!

చ. కనులను నీరు తుడ్చెడి ప్రకారము కాక మహానురాగ మా
త్మ నిగిడి యే యొసంగిరొకొ మాకవనీశులు సంస్కృతంపు శా
సనసభ లక్కటా! తుదకు సారవిహీనపు బెండమావులన్
గనుఁగొను టబ్బె ముప్పదియు నాల్గుశరత్తులపాట్లకీశ్వరా!

ఉ. ఇంచుక స్వేచ్ఛతోఁ దలయెత్తి చరింపఁగ వీలు లేదు జ
న్మించిన దేశమం దయిన; నెక్కడనో కడుదవ్వునుండి యీ
పంచను జేరువారలకు వంగియు వంగి సలాము లేము కా
వించుటకల్గె; నెప్డు తొలఁగింతువొ యీచెడుదాస్య మీశ్వరా!

# అశ్వఘోషమహాకవి

వేపులపల్లి అప్పల నరసింహము గారు; ఎమ్. ఏ. ఎల్. టి.

అశ్వఘోషమహాకవి వ్రాసిన 'బుద్ధచరిత' యను మహాకావ్యము శ్రీతిరుపతివేంకటేశ్వరకవుల భాషాంతరీకరణమువలన నాంధ్రలోకమునకు పరిచితమై యున్నది గాని మన సంస్కృతపండితులును విద్యార్థులును దీనినిగురించి మిగుల నుపేక్షవహించియున్నారని నా నమ్మకము. ఉదారచరితుఁడగు బుద్ధదేవుని చరితము సర్వమతములవారికిని ఆనందదాయకముగ నుండవలసినది. దీనియందు హైందవవిద్వల్లోకమునకు కుతూహలమును కలిగించుటకు కవెల్ పండితునివంటి పాశ్చాత్యవిద్వాంసులయొక్క ఉదారమగుకృషియే కారణము. చర్విత చర్వణముగ మనము పంచకావ్యములనుదక్క ఇతరములను గుర్తింప కుండుట తగదు. సరళపదజాలమును, శ్రావ్యములును అతిదీర్ఘములును నగు సమాసములును, సులభగ్రాహ్యములును లలితములును అగు అనుప్రాసరూపకోపమానాద్యలంకారములును మనస్సునకు సంతోసమును వికాసమును గలుగజేయువర్ణనలు నిందు గలవు. కథానాయకుని పుట్టుక మొదలు తపస్సిద్ధివఱకును జరిగిన వృత్తాంతములను పొంగుపఱచుటలో రచనాపటిమ సమానముగ నున్నది. మొత్తముమీఁద చదువరులకు విసుగుగలుగునట్టి గ్రంథభాగము లిందు లేవు. జన్మవృత్తాంతములను అందులకు సంబంధించిన నిమిత్తములను రాచనగరులోని ఉత్సవములను మొదటి సర్గయందును విద్యావయోవిలాసములను రెండవసర్గమునందును వర్ణించెను. నాయకుని జీవితములో ముఖ్యమగు మార్పుగలుగు సందర్భమున సహజమైన మార్దవమును, నరలోక దుఃఖములను జూచినపైని మనస్సునగలిగిన వైరాగ్యసంరంభమును, చింతాప్రాదుర్భావమును విపులముగను మానవమనఃప్రకృతిని స్ఫురింపజేయుగలుగునట్లుగను కవి వర్ణించియున్నాడు. బౌద్ధమతస్థులకు అనవసరమైనను కవికిని జనసామాన్యమునకును రంజకములగు బంధువిలాపము బుద్ధుని వెదకుట మఱలింపయత్నించుట అను భాగములు తగురీతిని భావపూర్ణముగఁ బ్రదర్శింపబడినవి. కడపటి నాలుగు సర్గలలోను బౌద్ధమతప్రచారమునుగుఱించియును ఆమతసిద్ధాంతములను గురించియును విస్తరించి వ్రాయఁబడినది. ఎంతయత్నించినను నాలుగు సర్గలును లభింపనందున అమృతానందుడను (బౌద్ధసన్న్యాసి) పండితుడు పూర్తిఁజేసెననియును అని 1830 (క్రీ॥ వె॥) సంవత్సరమునకు సమానమైన నేపాళమునుంచి లభ్యమైన లిఖితప్రతియందు గానబడుచున్నది. అశ్వఘోషుఁడు వ్రాసిన ఆసర్గలుకూడ లభించునెడల నవి హింసావిధ్వస్తండలమునకు అమోఘమగు ఆనందముఁ గలిగించి బౌద్ధధర్మముపట్ల నాదరణమును కలుగజేయు ననుకొందును.

**2. వర్ణన :** యీ కావ్యమున వర్ణనలు చాల తక్కువ. ప్రకృతి వర్ణనలు మిగుల కొలదిగను సూక్ష్మముగను నుండును. కపిలవస్తునగరవర్ణనము కావ్యారంభమునందు యచ్ఛందవృత్తము లగు శ్లోకములలోఁ జేయఁబడి కుమారసంభవమున హిమవత్పర్వతవర్ణనను జ్ఞప్తికిఁ దెచ్చును. రాజకుమారుఁడగు బుద్ధుఁడు ఉద్యానమునకు వెడలు సందర్భమున నగరాలంకారమును వర్ణించునవి ఈ క్రిందిశ్లోకములు:

శ్లో. తతః ప్రకీర్ణోజ్జ్వల పుష్పజాలం విషక్తమాల్యం ప్రచలత్పతాకం
మార్గం ప్రపేదే సదృశానుయాత్రః చంద్రస్సనక్షత్ర ఇవాంతరిక్షమ్
కౌతూహలాత్ స్ఫీతతరైశ్చ నేత్రైః నీలోత్పలార్ధైరివ కీర్యమాణః
శనైశ్శనైః రాజపథం జగాహే పౌరైస్సమంతా దభివీక్ష్యమాణః.

బుద్ధునికిని మారునికిని గలిగిన పోరాటమును 13 వ సర్గలో వర్ణించుచు మనోభావసంరంభద్యోతకముగ జేయక రణవీరుల కథలలో వలె శస్త్రాస్త్రప్రయోగము మయ మగు యుద్ధముగా వర్ణించుట ప్రౌఢమనస్కులగు చదువరులకు రసహీనముగా దోఁచవచ్చును. పార్వతీదర్శనమువలనను మదనసమ్మోహనసాయకమువలనను తపస్వియగు శివునకు గలిగిన మనోభావవికారము చక్కగాఁ బ్రదర్శింపఁబడినది. మన్మథుని సాయుధమూర్తిత్వము ఒక్కశ్లోకములో మాత్రమే సూచింపబడినది. ప్రాచీనాంగ్లభాషలోని కొన్ని కావ్యములలో సత్వాశ్రయుఁడగు క్రీస్తు కవచధారియు శూలపాణియు యోధుడునునై మూర్తీభూత మగు అరిషడ్వర్గమో యన తన్నెదిరించు సైతాను మొదలగు దయ్యములను పారద్రోలినట్లు వర్ణింపబడినాడు. ప్రాచీనకవి యగు మిల్టను క్రీస్తునకు సైతానునకు జరిగినపోరాటమును మనోభావపరీక్షక మగువివాదముగా నిర్మించియున్నాడు. కాని అశ్వఘోషుఁ డట్లు చేయలేదు. ఇది బౌద్ధగ్రంథములలోని వర్ణన సంప్రదాయము ననుసరించి యుండు ననుకొనెదను.

**3. పాత్రపోషణము :** నాయకుని ధీరోదాత్తత వినయము భూతదయ ఆయాచోట్ల నుచితరీతిని ప్రదర్శింపబడియున్నవి. కొన్నిచోట్ల "గర్వితుడై పలికెను" అని చెప్పుట యీధీమంతుని వినయమునకు కళంకముగ నగుచున్నది. [సర్గ 9. శ్లో. 69.]

బుద్ధునితండ్రి యగు శుద్ధోదనరాజుయొక్కయు, బుద్ధునిభార్య యగు యశోధరయొక్కయు విచారమును నిరూపించుటలో కవి మంచి కౌశలమును ప్రదర్శించియున్నాడు. మృదులములగు మానవభావములను సరసముగఁ గనబఱచియున్నాడు. వనవాసగతుఁ డగు బుద్ధుని వార్త విని శుద్ధోదనమహారాజు రామశోకపరితప్తుఁ డగు దశరథునివలె స్మృతి దప్పి ఇట్లు విలపించెను:

శ్లో. దశరథ ఇవ రామశోకవశ్యో బహు విలలాప నృపో విసంజ్ఞకల్పః
ఇమే పరీప్సంతి హి మే పిపాసవో మమాసవః ప్రేతగతిం యియాసవః.

బుద్ధుని పుట్టుకసమయమందు పెద్దలు ఏమని ఆశీర్వచించెదరో వంశాభివృద్ధి ఎట్లుండునో యను నాందోళము కుమారునికి చింతాక్లేశము కలుగకుండ జేయు ఏర్పాటులు, కుమారుని సన్న్యసింపకుండ మఱలింపు

జాలిమాటలు సన్న్యసించినవెనుక పంపినసందేశము అన్నియు అముదుసలి రాజునందు వదువరికి అనురాగమును జాలిని గొలుపునవిగ నిరూపింపఁబడియున్నవి:

శ్లో. వపూపి కామం హృదయం సుదారుణమ్
శిలామయం వా ప్యయ సాపి వా కృతమ్
అనాథవత్ శ్రీరహితే సుఖోచితే వసంగతే భర్తరి య న్న దీర్యతే॥

యశోధరావిలాపసందర్భమునందుఁ గల యీ శ్లోకము కుమారసంభవములోని యీ క్రింది శ్లోకభాగమును అనుకరించునట్లు తోఁచుచున్నది చూడుడు:

శ్లో. న విదీర్యే కఠినాః ఖలు స్త్రియః (VIII 60 70)

మొత్తముమీఁద యశోధరావిలాపము కొంతవఱకు రతీవిలాపము ననుకరించుచున్నది.

సుఖం విభీః మా మపహాయ రోషణామ్।
మహేంద్రలోకే ఒప్సరసో జిఘృక్షతి॥

ఈశ్లోకము రతీవిలాపములోని యీ క్రిందిశ్లోకమును పోలుచున్నది.

శ్లో. అహ మేత్య పతంగవర్త్మనా పున రంకాశ్రయిణీ భవామి తే
చతురైః సురకామినీజనైః ప్రియ యావ న్న విలోభ్యసే దివి

యశోధరాపాత్ర మింకను విరివిగా పోషించిన బాగుండు ననుకొనియెదను. యశోధర తన్ను రోషణ (అనఁగా రోషన) అనుకొనుటకు తగిన కారణమును కవి కనఁబరచియుండలేదు. రతి తన దేవతాత్వమును మఱచి అగ్నిప్రవేశముఁ జేసి ప్రియుని కలసికొనియెద ననుటయు వింతగానున్నది. రతీమన్మథులు దేవతలు గారా? లేక ఆకాశమునకు అమృతతముకొఱకు పాలసముద్రము తరువఁబడలేదా? కవిభావనలు నిరంకుశములు. అనువాదమున గాని వీనిని సమర్థింప వీలులేదా? తక్కినపాత్రములలో ముఖ్యమైనవి లేవు. గుఱ్ఱపువాఁడును సారథియును నగు ఛందకుఁడును, రాజుచే కుమారుని మఱల్చుటకు పంపబడిన మంత్రిపురోహితులును, సూచనమాత్రముగా ప్రదర్శింపబడినారు. వారు రాజు నోదార్చుట-తరువాత కుమారునికి బోధసేయుట-వారిబ్రాహ్మణజన్మమునకును రాజభక్తికిని, బుద్ధిసంపదకు నుదగినధీరత్వమునుమార్దవమునుకలిగియున్నవి.బుద్ధుని మనస్సు స్త్రీలవైపు మఱల్చుటకు 4 వ సర్గములో రాజుచే నేర్పరుపబడిన స్నేహితుఁడు చేయుపని యెట్టిదైనను స్నేహభావముతోను నేర్పుతోను రాజుహితముకొఱకు నెఱవేర్చినాఁడు. 10 వ సర్గలో మగధరాజగు బింబిసారుఁడు ఉదారభావములో మహాత్ముఁడగు బుద్ధుని సగౌరవముగఁ బ్రేమఁజూచుచు గృహస్థాశ్రమమునకు మఱలింప యత్నించియు నతను వినక కామనింద జేయుగా విస్మితుఁడై "మహాత్మా నీవు జ్ఞానమును పొందినవెనుక నన్నుఁ గృతార్థునిఁ జేయు" అని ప్రార్థించెను.

**4.** కవికాల ప్రశంస: కవెల్ పండితుఁడు ఆర్యన్ సిరీస్ మొదటివాల్యూము ఏడవపార్టులో బుద్ధచరితకు ఉపోద్ఘాత వ్రాయుచు నీతఁడు సభాకావ్య కర్తలకు (అనగామహాకావ్యకర్తలకు) మార్గదర్శకుఁడనియును, కాళిదాసునకు ముందువాఁడనియును, వ్రాసియున్నాఁడు. ఇందులకు రెండు ముఖ్యకారణములు జెప్పియున్నాఁడు. (1) కాళిదాసునకు బౌద్ధమతము బాగుగఁ బరిచితమని అతని నాటకములవల్ల తెలియును. ఈ వాదమునకు బదులు చెప్పుట సులభము. అశ్వఘోషునకు కుమారసంభవ కథ — శివుని తపస్సు, మన్మథుని పోరాటము— తెలిసినట్లు ఈకావ్యపాఠకులకు ననేకచోట్ల కనుపట్టును. కాన అశ్వఘోషునికాల నిర్ణయమునకు ఇది ఆధారము కానేరదు. బుద్ధచరితను గాక కొన్ని స్తుతి పుస్తకములను కూడ నీతఁడు రచియించె ననియు ప్రాచీన బౌద్ధమతాచార్యులలో నీతఁడు నొకఁడనియును, నాగార్జునార్యదేవాచార్యులకు ముందువాఁడనియు, ఇట్సింగ్ అను చీనాయాత్రికుఁడు (675 క్రీ. శ.) సంవత్సరమున వ్రాసియున్నాఁడు. ఈకావ్యము క్రీ. శ. ఐదవ శతాబ్దప్రారంభములో చీనాభాషలోనికిఁ తర్జుమా చేయబడె నని కవెల్ పండితుఁడు చెప్పుచున్నాఁడు. ఇండియాలో ప్రసిద్ధినొందుటకు సుమారు రెండుశతాబ్దములు పట్టియుండవలెను. అశ్వఘోషుఁడు మూడవ లేక నాలవ శతాబ్దివాఁడై యుండవనోపు నని కవెల్ పండితుని అభిప్రాయము. 'ఒకటవ శతాబ్దపు రాజగు కనిష్కునకు మిగుల సహాయముచేసిన గురువు ఈ అశ్వఘోషుడే అయి యుండుననుటకు వీలుకలదు అని సూచించుచున్నాఁడు. బొంబాయి కాశీపండితుఁడు ప్రబలనిదర్శనములతోఁ గాళిదాసు క్రీస్తునకుముందు ఒకటవ లేక రెండవ శతాబ్దులలో నుండినవాఁడనియు అగ్నిమిత్రరాజు నొద్దనో అతని పుత్రపౌత్రులలోనే ఏ యొకరి ఆస్థానమునో అలంకరించి రాజవంశమునకు ప్రీతికరమగు మాళవికాగ్నిమిత్రమను నాటకమును వ్రాసియుండవలె ననియు నభిప్రాయమును ఇచ్చియున్నాఁడు. కాశీగారి అభిప్రాయమునుబట్టి అశ్వఘోషుని కనిష్కరాజునకు గురువుగా నొసర్చినను ఆతఁడు కాళిదాసునకు ముందువాఁడని చెప్పుటకు వీలులేదు. హూయనుత్సాంగు అను చీనాయాత్రికుఁడు — అశ్వఘోషుఁడు, దేవుఁడు, నాగార్జునుఁడు, కుమారలబ్ధుఁడు ప్రాచీనగురువు లని క్రీ॥ శ॥ 444 సంవత్సరమున వ్రాసియున్నాఁడు. ప్రాచీనశబ్దమునకు ఎన్ని శతాబ్దములు వెనుకకు లెక్కపెట్టఁవలయునో నిర్ణయింపవీలులేదు.

ii రెండవవాదము: మూఁడవసర్గలో బుద్ధుఁడు వచ్చుచున్న వార్త నౌకరులవలన విని పెద్దల అనుజ్ఞనుపొంది అనేకవిధముల సంభ్రమముతో గవాక్షములయొద్ద గుమిగూడి చూచుచున్న పురస్త్రీలను వర్ణించుటలో "ముఖములు మేడల నలంకరించుటకై ఉంచిన పద్మగుచ్ఛముల వలె నున్నవి" అని కవి వర్ణించినాఁడు. ఇది 3 వ సర్గలోని 19 వ శ్లోకము. మఱల నీ వర్ణననే స్వల్పభేదములతో 21 వ శ్లోకముగఁ గూడ జేసియున్నాఁడు. చూడుడు:

శ్లో. వాతాయనేభ్య స్తువినిస్సృతాని పరస్పరోపాసిత కుండలాని
స్త్రీణాం విరేజు ర్ముఖపంకజాని సక్తాని హర్మ్యేష్వివ పంకజాని
తతో విమానై ర్యువతీకలాపైః కౌతూహలోద్ఘాటిత వాతాయనైః
శ్రీమత్సమంతా న్నగరం బభాసే వియద్విమానై రివసాప్సరోభిః
వాతాయనానా మవిశాలభావా దన్యోన్యగండార్పిత కుండలాని
ముఖాని రేజుః ప్రమదోత్తమానామ్ బద్ధాః కలాపా ఇవ పంకజానామ్.

రఘువంశములోను కుమారసంభవములోను పెండ్లికుమారులగు అజుఁడును శివుడును అత్తవారియూరఁ బ్రవేశించునవసరమునఁ గూడ నిట్టి వర్ణనతే కలవు. చూడుడు:

తాసాంముఖైరాసవగంధగర్భైర్వ్యాప్తాంతరాస్స్యంద్రకుతూహలానామ్
విలోలనేత్రభ్రమరైర్గవాక్షాస్సహస్రపత్రాభిగతా ఇవాసన్. (vi 62)

పై కావ్యములలో నివర్ణన కథాసందర్భమునం గేవలము అలంకారముకొఱకుఁ బ్రయోగింపఁబడెను గాని అశ్వఘోషునికథకు అది అత్యవసరమైనదఁట. బుద్ధునిమనస్సు ఉత్సాహముగా నుంచుటకు ఇట్టివి అవసరమఁట. అయినచో నాకర్లచేత వార్త వినుటయు, వారివారియిండ్లలో అలంకరించుకొనుటయు, మేడలమె క్కుటయు, మున్నగు వర్ణనలకు ఏమి అవసరమో? బుద్ధునకు ఇవి గనఁబడునా? ఇది అటుండవనిండు. ఈమహోపమానము అశ్వఘోషుని మనోవీథిని మొదట నుత్పన్నమైనదఁట. దానిని తరువాత కాళిదాసు దొంగిలించి పరమశ్రేష్ఠ మగుసందర్భముల స్పష్టపఱచి సగిషీచేసియుండునని కవెల్ పండితునకు తోఁచినది. పద్మము-పద్మాలంకారము - స్త్రీముఖములను పద్మములతో బోల్చుట - ఇవి భారతీయకవితకు మూలబీజములని చెప్పవచ్చును. సుందరకాండములో 5.22, 9. 37, 38, 45, 52, 57, 59 శ్లోకములలో రావణాంతఃపురమును హనుమంతుడు చూచుసందర్భమున నీపద్మోపమానము అనేకచిత్రరీతుల నుపయోగింపఁబడినది.

కాళిదాస అశ్వఘోషు లిరువురును వాల్మీకినుండి ఈ ఉపమానమును గ్రహించి యుండవచ్చును. సమకాలికులై యుండవచ్చును. ఒకరి నొకరు ఎఱుఁగకయుండవచ్చును. ఎఱిఁగినను ఈ సర్వసామాన్య కవితాభూషణమును వాడుటలో ఒకరిసొత్తు దొంగిలించినట్లు తలఁచియుండక పోవచ్చును. ఇంతమాత్రమున నశ్వఘోషుఁడు కాళిదాసునకుఁ బూర్వుఁడని చెప్పరాదు. కండలముల ప్రశంసగూడ వాల్మీకినుండి తీసిన శ్లోకము (10-34) లో నున్నది. కౌతూహల ప్రశంస కాళిదాసుని శ్లోకములోను అశ్వఘోషుని 20 వ శ్లోకములోను గలదు. అదియుఁగాక కుండలముల ప్రశంస అశ్వఘోషుని ఉపమానమునందలి మాధుర్యమును సానకములోనిపురుషకవలె చీకాకుపఱచుచున్నది. కవెల్ పండితునకు వాల్మీకి రామాయణమే అశ్వఘోషునితరువాత నని తోఁచుచున్నదఁట! బుద్ధచరితమున రామకథ అనేకపర్యాయములు ఉపమానరూపముగా తడవఁబడినను అది వాల్మీకిగ్రంథమునుండి గ్రహింపఁబడినటుల నూహింప వలనుపడదఁట! ఏలనన- రావణాంతఃపురములోని నిద్రావివశలగు స్త్రీలవర్ణనము కేవలము శృంగారమునకొఱకు కవి చెప్పినాడఁట. కాని బుద్ధచరితములోని అయిదవసర్గలో బుద్ధునికి విషయవైరాగ్యమును కలిగించుటకై దేవతలు స్త్రీల నందఱను ఒక్కసారుగ నిద్రావివశలుగ జేసిరఁట. ఇది కథాపోషణకు అవసరమఁట. అయినచో హనుమంతుడు మాత్రము సీతనుకనుగొనుటలో యిట్టిసీతులనుజూడ నవసరము లేదా? నిద్రావివశలగు స్త్రీల వర్ణన 48—62 వఱకుగల పదునైదుశ్లోకములలో గలదు. గాత్రవస్త్రములు వికృతములుగా నుండెను అని 47 వ శ్లోకములో నుపోద్ఘాతము చేసి వికృతములు మాత్రము కడపటి నాలుగుశ్లోకములలో వర్ణించెను. తక్కినశ్లోకములలో శృంగారరసపోషణయే కనఁబడును. దీనినిబట్టి అశ్వఘోషునివర్ణనలో వైరస్యము గల దని తేలునే గాని వాల్మీకి యీతనినుండి యీవర్ణనను దొంగిలించినాఁ డని తేలదు. ఇంతయేల? అశ్వఘోషుఁడే మొదటిసర్గలో 47 వ శ్లోకములో వ్యాసుని 48 వ శ్లోకములో వాల్మీకిని పేర్కొనియుండుటను కవెల్ పండితుడు గమనింపలేదు. కాని వృద్ధుఁడగుటచే నన్నియు సమగ్రముగ పరిశీలించుశక్తి లేకపోయెనని యుపోద్ఘాతాంతమున చెప్పుకొనియున్నాఁడు. ఆయనకృషికి వందనములు. ఇట్టియూహలు కూడ మొత్తముమీఁద కవియొక్క విలువను విద్వల్లోకమునకుఁ బ్రకాశపఱచుటకు ఉపయోగపడును.

iii. కవికాలనిర్ణయమునకు ఇంకొకసంగతిని కవెల్ పండితుడు సూచించియున్నాడు. అమరకోశమునుండ మాత్రమే, అర్థము తెలియఁగల మాటలు కొన్ని ప్రయోగింపఁబడినవి. "గంత్రీశ్చ చామీకరచిత్రరూపాః, గంత్రీః = బండ్లు. విదో ద్విజేభ్యః కృశనంచ గాశ్చ, కృశనమ్=బంగారు. ఇంద్రునకు "లేఖర్షభ" అను పేరును, సారథికి "సంగ్రాహక" అనుశబ్దమును, సాళీభాషలోనివఁట. ఇంటికి "ధిష్ణ్య" అనునది అమరకోశమునఁ గాననగును. ఇది కవి 4,5 పర్యాయములు వాడినాడు. అమరకోశము ముందా అశ్వఘోషుడు ముందా యను నిర్ణయమునకు ఇవి తోడ్పడజాల వని కాఁబోలు కవెలు పండితుడు సూచనతో వదిలినాడు.

5. **ఉపమానముల ప్రశంస:** పై కాలవిమర్శనమున యుపమానముల సొంపుస్ఫూర్తి కవియొక్క ప్రతిభాస్వాతంత్ర్యమును తెలియఁజేయు నను కవెల్ పండితుని అభిప్రాయము కొంత చర్చింపఁబడెను. ఇంకొక ఉపమానమును ఈకవియొక్క ప్రతిభను సూచించుటకు ఉదాహరించెదను. బుద్ధుని మఱలించుటకు పంపఁబడిన మంత్రిపురోహితు లిద్దరును, బుద్ధునిసన్నిధానమున చంద్రునితో సంయోగమును బొందిన పునర్వసూనక్షత్రద్వయమువలె విరాజిల్లిరి. 'విరేజతుస్తస్య చ సన్నికర్షే పునర్వసూ యోగగతా వివేందోః' అని వర్ణింపఁబడిరి. కాళిదాసుని రఘువంశములో రామలక్ష్మణులు మిథిలాపట్టణమును ప్రవేశించునప్పుడును (గాం గతా వివ దివః పునర్వసూ), ఈక్రిందిశ్లోకమునందును వాల్మీకి రామాయణములో పునర్వసూపమానము వాడఁబడియున్నది. ప్రవిశన్నాశ్రమపదం వ్యరోచత మహామునిః। శశీవ గతనీహారః పునర్వసు సమన్వితః॥

ఈ పునర్వసూపమానము వాల్మీకికాళిదాసుల ప్రయోగమునం దధికమనోజ్ఞముగ నున్నది. ఇట్టిది అశ్వఘోషునిలో నిది యొక్కటియే. వాల్మీకిలో మెండు. కాళిదాసునియొక్క లలితమగుకవితాసూత్రమందు తారాచంద్రసంయోగద్యోతకము లగు ఉపమానములు ముఖ్యములు. శకుంతలను సఖు లనుసరించుట విశాఖాద్వయము చంద్రలేఖ ననుసరించుటవలె అనురూపముగ నున్నదనియు సుదక్షిణాదిలీపులశోభ చిత్రానక్షత్రముతోఁగూడిన చంద్రునిశోభవలె నున్నదనియు నను రెండు ఉపమానములమాత్రము మిగులకు చాలును.

అశ్వఘోషునియందును ఉపమానములకు కొఱఁత లేదు. చక్కని క్రొత్తయుపమానమును ప్రయోగించియే యున్నాఁడు.

యస్మిన్ప్రసూతే గిరిరాజకీలా
వాతాహతా నౌరివ భూశ్చచాల॥

ఇది బుద్ధజననసందర్భములోనిది. ఈ యుపమానము క్రొత్తదైనను ఘనప్రతిభాద్యోతకమైనను, బుద్ధావతారసందర్భమున వర్ణింపఁబడిన శుభనిమిత్తములనధ్య వర్ణింపఁబడుట యయుక్తము. ఈస్థితి కల్యాణిరాగమున యదుకులకాంభోజికల దింపినట్లున్నది. విమర్శనావసరమున

సూర్యునియందైనను మచ్చలు జూపవలసియుండును. కవులతారతమ్యముల గ్రహించుట కిదియె మార్గము. కవిత్వములోని రసాస్వాదనకు ఇట్టి విమర్శనములు తోడ్పడును. ఇది కవిప్రతిభానిరసనము కాదని చదువరులు గ్రహింపనగును. సంస్కృతవాఙ్మయమున సభాకావ్యనిర్మాతలలో కాళిదాసాశ్వఘోషులు సమముగ ప్రథమస్థానార్హులని చెప్పవచ్చును. ఇద్దఱును వాల్మీకినుండియే ప్రతిభాదీప్తి నందినవారు గాని కాళిదాసుని ఉపమానములలో లాలిత్యము, స్వాతంత్ర్యము, ఔచిత్యము తఱుచుగా నుండును. అశ్వఘోషుని ఉపమానములలో అక్కడక్కడ స్వాతంత్ర్య మున్నను, ఔచిత్యము తక్కువయని తోచును. మీదను నా కోపమనుదాహరించితిని. 6-వ సర్గలో సన్న్యసించినబుద్ధునకు సారథియగుఛందకుడు చెప్పువాక్యములలో వాడిన ఉపమానములు ఔచిత్యశూన్యములని తోచును. ఉపమానభాగములు వదలినచో ఛందకుని మిగిలిన వాక్యములలో కరుణరసము సమంజసముగ నున్నది. చూడుడు సర్గ 6. శ్లో 31-34. కాని మొత్తముపైన ఈయనయుదాహరణములు చాల వఱకు మనోజ్ఞములుగను సరసములుగను నుండును. కొన్నిటిని పరికింపుడు:

1. సంధ్యాభ్రజాలోపరి సన్నివిష్టం నవోడురాజం విజిగాయ లక్ష్మ్యా॥

2. ముహుర్ముహు ర్మదవ్యాజ ముక్తనీలాంశుకా పరా। ఆలక్ష్యరశనా రేజే స్ఫురద్విద్యు దివ క్షపా. (IV 33.)

3. ప్రతి సంకుచితారవిందవక్త్రాః సవితర్యస్తమితే యథా నలిన్యః॥ (V 59)

ఈ చివరశ్లోకోక్తరీతి వాల్మీకిసుందరకాండమున 10-35 న నిట్లు కానవగును: ప్రబుద్ధానీవ పద్మాని తాసాం భూత్వా క్షపాక్షయే పున స్సంవృతపత్రాణి రాత్రావివ బభు స్తదా॥

అశ్వఘోషుఁడు ఉదాహరణములలో భారతరామాయణగాథలను వాడుట తఱుచు కనబడును. ఇవి గాక అనేక పురాణగాథలను తడవుచున్నాఁడు. ఆయాగాథలను విమర్శించినచోఁ బెక్కింటికి ఈతనికాలమునకు ముందున్న పురాణము లేవో తెలియ వీలగును. ఇట్టి ఉదాహరణము నొకటి నిచ్చెదను.

ఐడశ్చ రాజా...లోభాదృషిభ్యః కనకం జిహీర్షుః
జగామ నాశం విషయేష్వశక్తః (XI. 15.)

ఐడవినాశనకథ ఋగ్వేదమునందును భాగవతమునందును గలదు. కాని ఋషిధనమును అపహరించుటవలన నశించెను అనుట క్రొత్త. ఇదియెట్లాధార మేమో ?

6. కథాసంగ్రహణక్రమము: ఈమహాకావ్యమున కథానాయకుడు సత్త్వనిధియు అహింసాబోధకుడును అగు బుద్ధదేవుఁడు. ఇందు 17 సర్గలు కలవు. సర్గాంతవాక్యములయందు వరుసగ నీ క్రింది పేర్లుంచబడి యున్నవి. 1. భగవత్ప్రసూతి 2 అంతఃపురవిహారము 3. సంవేగోత్పత్తి. 4. స్త్రీవిఘాతనము. 5. అభినిష్క్రమణము. 6. ఛందకనివర్తనము 7. తపోవనప్రవేశము 8. అంతఃపురవిలాపము 9. కుమారాన్వేషణము 10. శ్రేణ్యాభిగమనము 11. కామవిగర్హణము 12. అరాడదర్శనము 13. మారవిజయము 14. అభిసంబోధనసంస్తవము 15. ధర్మచక్రప్రవర్తనాన్వేషణము 16. ధర్మచక్రప్రవర్తనము 17. లుంబినీయాత్రికము అని. కడపటి నాలుగు సర్గలును మతసంబంధమైనవి. బౌద్ధమతప్రచారమును వర్ణించుచున్నవి. కావ్యములోని రసవంతమగు భాగము మారవిజయముతో ముగిసినది.

నాయకునిజననమునకుఁ బూర్వమే ఇంద్రాదిదేవతలు మానవోద్ధారణకై బుద్ధుఁడవతరించు నని కుతూహలము గలిగియుండిరి. శుభసూచనలతో బుద్ధుఁ డుద్భవింపఁగనే దేవతలు వచ్చి అమరగంగాధారలచే నభిషేకముచేసి ఆశీర్వదించిరి. తర్వాత అసితుడనుఋషి వచ్చి చూచి ఉప్పొంగి కన్నీరుగార్చెను. శుద్ధోదనమహారాజు భయముతో శంకించెను. అందుపైని అసితుడు నీవు వేఱువిధముగాఁ దలఁపవలదు. నేను ముదుసలినగుటచే ఈమహానుభావుడు జీవలోకగతిఃణధర్మమును బోధించువఱకు జీవింపనుగదా యని విచారించితి ననెను. రాజు సంతసించి జాతకర్మాదులను ఉత్సాహముతో జరిగించెను.

తరువాత యుక్తవయస్కుడైన బుద్ధుడు కౌశికమునివరుని సహాయమాత్రమున స్వల్పకాలములో సకలవిద్యల నభ్యసించి యశోవిశాలయగు 'యశోధరాదేవి'ని పరిణయ మాయెను. సకలశృంగారాస్పదములు సుఖానందపరిస్ఫుతములు నగు భవనములు విమానములు ఈయనకొఱకు ఏర్పాటుచేయఁబడినవి. రాజు ఈతఁడు సన్న్యసించునను భయముచే విచారజనకములగు వస్తువులను గాని అసహ్యకరమగు మనుష్యులను గాని యీతనికి దరిచేరనీయలేదు

ఇట్లుండ నొకనాఁడు పురోద్యానవిహారముకొఱకు రాజకుమారుఁడు రాజమార్గమునఁ బోవుచుండఁగా, జరారోగజీర్ణాంగుఁడగు మనుజుఁ డొకఁడు దేవప్రేరితుఁడై వెలువడియెనట. రాజకుమారుని దృష్టి వానియందు లగ్నమాయెను. సారథి నడుగఁగా, నాతఁడు ఎల్లజీవులకును జరావ్యాధిమృత్యుభయము తప్పదనెను. ఉద్యానవనమునకు పోవక రాజకుమారుఁడు విచారముతో భవనమునకు మరలెను.

ఇంకొకమారు ఈదేరీతిగా వెళ్లునపుడు శ్మశానమునకుఁ గొనిపోబడుచున్న శవ మగపడగా సారథిని ప్రశ్నించి బుద్ధుడు మనస్సును చింతామగ్నమును గావించుకొనెను. ఉద్యానములో స్త్రీలనేకవిధముల యౌవనోల్లాసముల నెఱపి కరఁగింప యత్నించియు విఫలురైరి. రాజుచే నియోగింపఁబడిన స్నేహితుని బోధలు గూడ నిష్ఫలములాయెను.

జరా వ్యాధిశ్చ మృత్యుశ్చ యదిన స్యా దిదం త్రయం
మమాపిహి మనోజ్ఞేషు విషయేషు రతి ర్భవేత్

అని బుద్ధుడు జవాబిచ్చెను. పగలంతయు ఉద్యానవనము నలంకరించి జనశోభ సాయంతనమున దానిని వదలుటను జూచి అన్నివస్తువులయందును గల అనిత్యత్వమును ఆలోచించుచు రాకుమారుఁడు తిరిగి తనభవనమును ప్రవేశించెను.

మరి కొన్నాళ్లకు మంత్రిసుతులు చిత్రకథలు చెప్పుచు వెంట రాఁగా, వనభూమి నారాముకుతూహలముతో బయలు వెడలి "వ్యవసాయమువలన నశింపఁ జేయబడిన మొక్కలను చిన్నపురుగులను చూచి

తనబంధువుల నాశమునకుఁబోలె దుఃఖించుచు గాలి, యెండ, ధూళి వీనిచే వర్ణము మాఱియున్న కర్షకులను నాఁగలి లాగు శ్రమచే నలిగి యున్న యెడ్లనుజూచి మిగులజాలినొంది అనుచరులను విడిచి ఒంటరిగా నొక జంబూవృక్షముక్రింద కూర్చుండి తనబుద్ధిని నిర్మలము చేసికొన యత్నించెను. అంతలో అదృశ్యరూపమున సన్న్యాసియొకడు "నేను జన్మమృత్యుభీతుఁడనై మోక్షమార్గమును వెదకికొనుటకు సన్న్యసించితిని" అని చెప్పి ఆకాశమార్గమునఁ బోయెను. తరువాత రాజకుమారు డింటికిఁ బోవుచుండ త్రోవలో "ఆహా! ఇటువంటిపతిఁగల భామిని సుఖమును నిర్వాణమును బొందినదేగద." అని యనునొక కాంతమాటలను విని శాంతిని బొందెను. వెంటనే సభాసీనుఁడగు రాజునొద్దకుఁ బోయి తాను సన్న్యసించుటకు అనుజ్ఞనిమ్మని కోరెను. రాజు వానిని బ్రతిమాలి మఱలింప యత్నించెను. పిమ్మట నంతఃపురమున స్వర్ణసింహాసనమునఁ గూర్చుండెను." అంతఃపురజనులు మృదంగవేణువీణాదులతో నాతనిని సేవించిరి. కాని దైవప్రేరితమై ఒక్కమాఱుగా వారిని నిద్ర ఆవేశించెను. ఆ నిద్రావశలైన యువతుల చేష్టలవలన బుద్ధునిమనస్సు దిరిగి యిదియే సమయమని బయటికిఁజని సారథిని బిలువఁగా నతఁడును దైవప్రేరితుఁడై కఠినమైన రాజాజ్ఞ నెఱింగియు రాజకుమారునికొఱకు గుఱ్ఱమును దెచ్చెను. గుఱ్ఱముకూడ నిశ్శబ్దముగా వచ్చెను. దానిని ప్రేమతో బుద్ధుఁడు కౌఁగిలించి తనహస్తకమలములతో నిమిరి సేనలోనికిఁ బోవు వీరునివలె మధురములగు మాటలతో బుజ్జగించి దాని నధిష్ఠించెను. దైవమాయవలన ద్వారాలన్నియు తమంతటతెఱచుకొనియెను. ఊరు వెలువడినతరువాత బుద్ధుఁడు వెనుకకుఁదిరిగి "జననమరణములయొక్క ఆవలిదరిని కనుఁగొనక కపిలవస్తుపురమును తిరిగి నేను ప్రవేశింపను" అని ప్రతిజ్ఞచేసి వెడలెను.

దైవమాయాసహాయమున బహుయోజనములఁ గడచి "తెల్లవాఱుసరికి" భృగువు ఆశ్రమమును జేరెను. గుఱ్ఱము దిగి ఛందకుని మంచిమాటలతో మరలింపుమండ విని కంథక మను పేరుగల ఆ ఉత్తమాశ్వము వేఁడికన్నీళ్లను విడుచుచు రాకొమరుని పాదముల స్పృశింపఁగా స్నేహితునితో మాటలాడినట్లు మాటలాడి వదలెను. ఇంద్రుఁడొక వేటగానివలె కాషాయవస్త్రములను ధరించి రాఁగా బుద్ధుఁడు అవి తనకిమ్మని పుచ్చుకొని ధరించెను. ఛందకుఁడు చేయునదిలేక గుఱ్ఱమును బట్టుకొని ఏడ్చుచు అవశుఁడై జాలిపడుచు శరీరమాత్రముతో పురమును జేరెను. అట బుద్ధుఁడు ఆశ్రమవాసుల తపోహోమక్రియలను జూచి తృప్తినొందక వింధ్యప్రాంతమున నున్న "ఆరాడ" ముని ఆశ్రమమును వెదకికొనుచుఁ బోయెను.

ఎనిమిదవ సర్గ అంతఃపురవిలాపముతో నిండియున్నది. ఈసర్గ యంతయు కవియొక్క శైలీమాధుర్యమును ఆంతరంగిక భావగ్రహణ కౌశలమును కనఁబఱచుచున్నది. చక్కనినాటకాంకమును బోలియున్నది.

9 – వ సర్గలో మంత్రిపురోహితులు బుద్ధుని వెదకి కన్గొని బోధించి మరల్పఁజూచిరి గాని విఫలప్రయత్నులై పురమునకు తిరిగి వచ్చిరి.

అటుపైని బుద్ధుఁడు ఆరాడాశ్రమమును వెదకికొనుచు "రాజగృహ" మను మగధరాజ్య ముఖ్యపట్టణమును జేరి భిక్షఁజేసికొని ఊరి వెలుపల నుండు కొండప్రక్కను విశ్రమించియుండెను. మగధరాజు బింబిసారుడు (లేక శ్రేణ్యుడు) ఈతనిఁజూచి హితవాక్యములచే సంసారమార్గమునకు మరలింపఁజూచెను. బుద్ధుఁడు కామవిగర్హణముచేసి ప్రత్యుత్తరమునిచ్చెను. 11-వ సర్గయంతయు నీ కామనిందతో నిండియున్నది. జ్ఞానమోక్షమార్గములఁ గనుఁగొని తన్ను ఉద్ధరింపవలసిన దని బింబిసారుడు వేఁడికొని పురమునకుఁ బోయెను. బుద్ధుఁడు ఆరాడమునిని దర్శించెను. ఆయనయొక్క ఆదరణకు సంతసించెను గాని ఆయనయొక్క వేదాంతము దనకు మిథ్యయని తోఁప అక్కడనుండి రుద్రకమునికడ కేగెను. అక్కడను తృప్తిగానక నైరంజనానదీతీరమున కేగి తపముఁజేయ నారంభించెను. కాని క్రమముగా ఆ తపస్సువలన లాభము లేదని గ్రహించి గడ్డిపఱచుకొని అశ్వత్థమూలమునఁ గూర్చుండి ధ్యానించుచుండెను. ఈసందర్భముననే మారునితోఁ బోరి బుద్ధుఁడు విజయము గాంచెను.

14-వ సర్గములో బుద్ధునికి దివ్యజ్ఞాన మలవడుట తెలిసి అర్హతులు ఆకసులు వచ్చి స్తుతించుట వర్ణింపఁబడెను. తరువాతిసర్గలలో బుద్ధునిసంచారము, ధర్మచక్రప్రవర్తనము, స్వరాజ్యమునకు వచ్చి తాను పుట్టిన "లుంబినీ" అను పేరుగల ఉద్యానమున బసచేసి తనవారల నంద అను మోక్షమార్గమునకుఁ ద్రిప్పుటయును విపులముగాఁ జెప్పఁబడినవి.

7. కథాపోషణ విమర్శనము: ఇట్టి మహాత్ముని చరిత్రము కథావస్తుగాఁ గలది ఆధ్యాత్మిక కావ్య మననొప్పును. వైరాగ్యపూరితమై శాంతరసప్రధానమైన యీకథను 2, 3, 4, 5 సర్గలలో బుద్ధుని అంతఃపురవిహారములయందు వివిధశృంగారరస కళలతోను, 8-వ సర్గలో బుద్ధునిప్రవ్రజనానంతరము అంతఃపురవిలాపకరుణారసముతోను మారుని సమరసందర్భమున వీరరసముతోను భూతగణముల వర్ణనమందు కొంచెము హాస్యరసస్పర్శ గలిగిన భయానకరసముతోను ఉదారచరితుఁ డగు నాయకునకు దైవసహాయమును సూచించు ఆయాసందర్భములయందు హృదయమునకు మితిమీఱిని వికాసమును ప్రమోదమును గలిగించు నద్భుతరసముతోను పలురుచుల సమ్మేళనమును గోరు సారస్వతాసక్తు లగు సామాన్యచదువరులకు ఇంపుగొలుపునట్లు కవి యొనర్చినాఁడు. మామూలుగ బుద్ధచరితలో మనము వినుచుండు కొన్ని యంశములను ఈకవి వదలినాఁడు. (i) బుద్ధుఁడు ఒక చెట్టుక్రింద కూర్చుండియుండ ఆయనమాహాత్మ్యమువలన ఆనీడ ప్రొద్దు తిరిగినను కదలకుండెనట. ఇది "లలితవిస్తర" మను బౌద్ధగ్రంథమునఁ గలదు. కాళిదాసు రఘువంశములో రాముఁడు సీతతోడనై తలనిడుకొని చెట్లనీడల నిద్రింప నిట్టులే చెట్లనీడ నిశ్చలముగా నుండుట చెప్పియున్నాఁడు. ఈయద్భుతకథ అశ్వఘోషునికాలమునకు చెప్పుకొనఁబడియుండలే దనియు కాళిదాసు లలితవిస్తరమునుండి గ్రహించె ననియు కవెల్ పండితుని అభిప్రాయము. పురాణము లెప్పుడు ఇప్పుడున్నరీతిగా వ్రాయఁబడినను వానిలోని గాథలుమాత్రము సనాతనము లని వీబరు పండితుఁడును మెక్డొనెలుపండితుఁడును ఒప్పుకొనియున్నారు

ఇట్టి అద్భుతములను పురాణ గాథలలోనుండి ప్రజలు, ప్రజల నుండి కాళిదాసాదికవులు సామాన్యముగా గ్రహించి యుందురు. (ii) బుద్ధుఁడు రాత్రి నగరువిడిచి వెళ్లుటకు ముందు నిద్రించుచున్న యశోధరను - పిల్లవానిని - విడువలేక మమ్మారు తిరిగివచ్చి చూచి శయ్యకు ప్రదక్షిణము జేసి ముఖముపై వస్త్రము గప్పుకొని పడకగది విడిచి వెళ్లెనని సర్ ఎడ్విన్ ఆర్నాల్డు కవియొక్క "లైట్ ఆఫ్ ఏషియా" అను కావ్యమున ఆంగ్లవిద్య నభ్యసించినవారికి తెలిసినవిషయము. ఇది కావ్యమునకు మితిలేని వన్నెపెట్టు నంశము. అశ్వఘోషుఁడేల వదలెను? (iii) లలితవిస్తర మను గ్రంథమున యశోధర, గోప, మృగాజ్ఞ యను ముగ్గురుభార్యలును, అఱువదివేలయువతీయుత మగు నంతఃపురమును ఉండెనని చెప్పఁబడియున్నది. యువతీజన సంఖ్యను పెంపుగా ప్రదర్శింపక పోవుటయును, ఒక్కయశోధరాదేవిని మాత్రమే పేర్కొనుటయును, 8-వ సర్గములోని కరుణారసపుష్టికి తోడ్పడిన వని నా అభిప్రాయము. (iv) బుద్ధునితల్లి యగు మాయాదేవి యాతడు పుట్టిన కొలఁదికాలములోనే మృతినొందె నని చెప్పఁబడియున్నది. అశ్వఘోషుఁడు ఆమె బ్రదికియున్నట్లును, సన్న్యసించుట విని దుఃఖించినట్లును,వర్ణించియున్నాడు. (viii-24, vi-32) కాని మెత యీశ్లోకమున (viii-24) గౌతమి యని పిలువఁబడియున్నది.

8. కాళిదాస వాల్మీకులతో పరిచయము: మొత్తముమీఁదనీమహాకావ్యము వాల్మీకిరామాయణశైలిని అనుకరించుఆసక్తిని కనఁబఱచునట్లు దోఁచుచున్నది.కాని కథావస్తువు కొంచెముగా నుంచుకొని చిత్రవిచిత్రములగు నలంకారములు, వర్ణనలు, ఉత్ప్రేక్షలు ముఖ్యమైన ఆదర్శములుగ నుంచుకొన్నటుల కనఁబడుచున్నది. మనోభావ ప్రదర్శనములలోఁగాని వర్ణనలలోఁగాని భారతరామాయణములనుండు ఉత్సాహముగాని విరివిగాని లేవు. సామాన్యజనులకుతూహలమును వృద్ధి జేయురీతి వేఱు. రాజసభలను రంజింపఁజేయురీతి వేఱు. దీనికి భావసూచనయందును రచనయందును నేర్పు మితవాక్యసరళియు ప్రధానములు. దానికి భావములను నొక్కినొక్కి చెప్పుట,అతిశయముగ వర్ణించుట అవసరము. సభాకావ్యములలో కథకు సగముసగము సంబంధము గల ప్రసంగములకును గాథలకును చోటు లేదు. ఇందుచేతనే "కుమారసంభవ" మను పేరునుబట్టి, కుమారస్వామిజన్మతరువాతిసర్గలు కాళిదాసు రచించినవి కావని కొందఱభిప్రాయపడుచున్నారు. అయితే, రఘువంశము విషాదాంత మయి యున్నది. ఇట్టిది కావ్యమునకుఁ గూడునా? కాళిదాసుకావ్యములలో నొకటి 17, యింకొకటి 19 సర్గలు కలిగియున్నవి. ఒకటి అనుకొన్న కథను మించియున్నది; ఇంకొకటి అనుకొన్న వంశావళిని ముగింపక విరమించినది. సభాకావ్యములకు క్రొత్తత్రోవ దీనంటలో నియమములు పెట్టుకొనకుండ వ్రాసెనా? అశ్వఘోషుఁడు తన కావ్యమునకు 17 సర్గలను నియమించినాఁడు. అశ్వఘోషుఁడు వ్యాసవాల్మీకుల పేర్లను స్మరించినాడు. వాల్మీకిరామాయణముతోఁ గల సంబంధము పుస్తకమందంతటను స్ఫురించును. అనుప్రాసయందు అశ్వఘోషుఁడు వాల్మీకికి శిష్యుఁడని తోఁచును. ఉదా:

త చ్ఛ్రుత్వా న స విచచార రాజసూనుః
కైలాసో గిరి రివ నైకచిత్రసానుః.

శ్లేష మొత్తముమీద కనఁబడదు. "అవ" ధాతువు బుద్ధుఁడు బింబిసారుని ఆశీర్వదించు శ్లోకమున ననేకార్థములలో వాడినట్లున్నది.

అథేంద్రవ ద్దివ్యవ శశ్వ దర్కవత్
గుణైరవ శ్రేయ ఇహావ గా మవ
అవాయు రార్యై రవ సత్సుతా నవ
శ్రియశ్చ రాజ న్నవ ధర్మ మాత్మనః.

'పరా' అను ఉపసర్గగల 'ఇ' ధాతు వొకటి క్రమాలంకార మొకటి ఈ కవికి ప్రియము లని ఈసందర్భమున చెప్పవలసియున్నది. "పరైమి" "పరేహి" ఈశబ్దములు తఱచుగా కనఁబడును. క్రమాలంకారములు మెండుగఁ గలవు. క్రమాలంకారము రామాయణములో కనఁబడదు. కాళిదాసునందును నాచదివినంతవఱకు లేదని జ్ఞాపకము. అశ్వఘోషుని అనుప్రాసలు మాత్రము వాల్మీకిని పెక్కుచోట్ల స్ఫురణకు దెచ్చుచున్నవి. ఉపమానములలోఁగూడ వాల్మీకిస్ఫురణ 6-వ సర్గలోను ఇంకను ఇతరచోట్లను మనస్సునకు తట్టును. కాళిదాసునకు అశ్వఘోషునకు-సభాకావ్యశైలి-సమాసప్రయోగము. సామాన్యములు. కుమారసంభవకథాస్మరణము బుద్ధచరిత్రమున స్పష్టముగా కనుపట్టుచున్నది. కొన్ని ఉదాహరణములు:

1. భవ ఇవ షణ్ముఖజన్మనా ప్రతీతః
2. శైలేంద్రపుత్రీం ప్రతియేనవిద్ధో
   దేవోఽపి శంభు శ్చలితో బభూవ.

పురస్త్రీలు రాజపుత్రుని చూచుటను వర్ణించుశ్లోకములు (III. 13-24) శివుని ఓషధిప్రస్థవిలాసినీజనులు చూచుటను వర్ణించుశ్లోకములఁ బోలియున్నవని యిదివరకు చెప్పియుంటిని. ఇట్టివర్ణన ఆదికావ్యమందలి నియమము గాదు. సభాకావ్యములలో నాచారముగా నున్నది. భాగవతపురాణమందు కృష్ణుఁడు హస్తినాపురము వదలి వెళ్లునప్పుడు పురయువతులు అతని మహిమను సౌందర్యమును గుఱించి చెప్పుకొన్నట్లు వర్ణింపఁబడినది. ఇందు బుద్ధునిఁ జూచి ధన్యాస్య భార్యేతి శనైరవోచన్ శుద్ధైర్మనోభిః ఖలు నాన్యభావాత్ అనిరి. కాని ఇందు, ఇతరభావముతోఁ గాదు అని కవి చెప్పకలయునా? బుద్ధుని జన్మసందర్భమున శుభసూచనలు కుమారజన్మసందర్భమునఁ జెప్పఁబడిన శుభసూచనలఁ బోలియున్నవి. కొన్నిచోట్ల ఒకేశబ్దములు గూడ ప్రయోగింపఁబడి యున్నవి. ఇందుకు ఒకఉదాహరణము: వాతావవుః స్పర్శసుఖాః మనోజ్ఞాః (బుద్ధచరిత) వాతావవుః సౌఖ్యకరాః (కుమారసంభవము.)

కాళిదాసు "జలము లన్నియు నిర్మలము లాయె" నని వర్ణింప, పులిమీఁది పుట్రవలె అశ్వఘోషుఁడు "ఇంటియొక్క ఈశాన్యదిక్కునందు తనంతటు తానే (త్రవ్వకుండఁగనే) తెల్లని నీరు గల కూపము ఉద్భవించెను" అని చెప్పెను. ఈయూహ ఎవరికి మొదటఁ గలిగియుండును? సూక్ష్మముగ చెప్పినవానికా? విపులముగ చెప్పినవానికా

అత్యద్భుతము. ఎటువంటి పాపియైనను తల్లిని మోహదృష్టులఁ జూడఁ జాలఁడు. అట్టిచో మహామహుఁ డగు సారంగధరుని విషయము చెప్ప నేల? ఇఁకను వరూథినీప్రవరుల చరిత్ర మట్టిది కాదు. వరూథిని అనూఢ. తగినవరుని కాంక్షించుచున్నది. తలవని తలఁపుగ సుందరపురుష దర్శన మయినది. ఆ దివ్యసుందరమూర్తిని చూచుటతోడనే ఆమెకు హావభావము లుదయించినవి. కోరిక ఫలించినటులే సంతసించినది. కాని ప్రవరుఁ డాహితాగ్ని; ఏకపత్నీవ్రతుఁడు. వరూథినిని చూచి నంతనే యతనికి మోహలేశమును కలుగలేదు. ఈపట్టున సారంగ ధరునికన్న నితఁడు మిన్నయని చెప్పవచ్చును. ఏల యనఁగా వరూథిప్రేమ చిత్రాంగిప్రేమవంటిది కాదు. చిత్రాంగి తాత్కాలికసుఖమును మాత్రమే యాసించినది. వరూథిని చిరకాలసుఖమును కోరుచున్నది. ఇది సంభవము. అది అసంభవము. ఇది సంభావితము అది అసంభావితము.

ఒకపాత్రమును ప్రేమరసము చిప్పిలునట్లు నిర్మించి రెండవ దానిలో ప్రేమాభావము వ్యక్తమగునట్లు వర్ణించుట ప్రేమపరిణామ రసపోషణముల కనుకూలముగ నుండును. వరూథినిని చూచినతోడనే ప్రవరుఁడు వరూథినీప్రేమమాయావాగురలోఁ దగుల్కొనినయెడల మనుచరిత్రలోని పూర్వభాగ మంతయు నిరర్థకమే యగును. చిలుక తినంతట తాను మనచేతికిఁ జిక్కుటలోను దానిని పట్ట ప్రయత్నించి చేయునట్టి ప్రయత్నపూర్వక సాధనములోను గల ఆనందములో నెంతవ్యత్యాస మున్నదో చూడుఁడు. నిరాశాప్రవాహములో లభించిన ఆశాలతయే ప్రాణప్రదము. అదియే అన్నివిధముల నత్యుత్తమము. వరూథినీ ప్రవరుల చరిత్ర మిట్టిది. ప్రవరునియందు వరూథినికి అత్యధికమగు ప్రేమ జనించినది. కాని వరూథినిపైఁ బ్రవరున కావంతయేని ప్రేమ లేదు. కనుక నిచ్చట శృంగార సమ్మిశ్రిత మగు కరుణరసము చిప్పిలుచున్నయది.

ఈ ఘట్టమున రసపోషణ మెంతయుఁ బ్రశంసనీయము. వరూథిని విద్యుల్లతావిగ్రహ; శతపత్రేక్షణ; చంచరీకచికుర; చంద్రాస్య. యచ్యుతన లేందు జయంత వసంతకంతులను చక్కఁదనములో గెలువఁ జాలిన మహీసురుని వీక్షించినది. వెంటనే మోహవిభ్రాంతి కలిగినది. ప్రవరునకు ఈవాసనయే తట్టలేదు. "త్రోవఁదప్పితిని. దారిఁ జూపుము మీకు శుభ మగు" ననుచుండఁగా, వరూథిని ఏమనుచున్నదో చూడుఁడు:

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించులా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవచొప్పు! నీ
కింత భయంబులే కడుగ నెల్లిద మైతిమి మాటలేటికిన్?

ప్రవరుఁ డీమాటల నంతగాఁ బాటింపలేదు. కాని వరూథిని అంతటితో విరమింపలేదు. నిజాభిజాత్యము నేకరువు పెట్టినది. ప్రేమ పూర్ణములగు నాలాపములను గురియించినది. ఆతిథ్యముఁ జేకొను మని ప్రార్థించినది. కుందనమువంటి మేను మధ్యందినాతపోష్మహతిఁ గంది నదిగదా! యని పరితాపపడినది. ఆహా! ఏమి ఆప్రేమవిలాసము!

ప్రవరుఁ డింతటితో వరూథినికి వశుఁడైనయెడల రసపోషణ మింతటితో నంతరించియుండును. ఇల్లెట్లు చేరుదునా యనియే అతని యాందోళనము. తల్లీ! అని వరూథినిని అతఁడు సంబోధించినాఁడు. తన్ను ప్రజలలోఁ బడవేయు మని బ్రతిమాలుచున్నాఁడు. కాని వరూథిని చిఱునవ్వుతో నేమనుచున్నదో చూడుఁడు:

ఉ. ఎక్కడియూరు కాల్నిలువ కింటికిఁ బోయెద నంచుఁ బల్కె దీ
వక్కట! మీకుటీరనిలయంబులకున్ సరిరాక పోయెనే
యిక్కడి రత్నకందరము లిక్కడి నందన చందనోత్కరం
బిక్కడి గాంగసైకతము లిక్కడి యీ లవలీనికుంజముల్.

ఉ. నిక్కము దాఁప నేల ధరణీసురనందన! యింక నీపయిన్
జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యములు చూఱలఁ బాటలువాడు తేంట్ల సొం
పెక్కినయట్టి పూవుఁబొదరిండ్లను గౌఁగిట గారవించెదో.

కాని ప్రవరుండు వైదికకర్మపరతంత్రుఁడై త్రోవచూపుమనియే ప్రార్థించుచున్నాఁడు. సామమునఁ గార్యము నెఱవేఱునట్లు లేదని వరూథిని దూషణములకు ప్రారంభించినది. ఆ దూషణముకూడ ప్రేమ పూర్ణమే కాని కోపసంజనితము కాదు. క్రమముగ-విషయలోలుపతను-ఆపిమ్మట నద్వైతతత్త్వమును-బ్రదర్శించి అందునను ఫలముఁ గానక-ప్రాంచద్భూషణబాహుమూలరుచితో నధర మాసింప నుపక్రమించినది. ఇదియే రసప్రకర్షకుఁ బరమావధి. ప్రవరుఁడు వరూథినిఁ ద్రోసివేసి నపుడు నిజముగ పాఠకుల భావనావిలోకనములలో ఆ చిత్రకళా ప్రదర్శనము వ్యక్తమగుచుండును. కళవళపాటుతో నున్న ప్రవరుఁడును లజ్జాపరవశయై క్రోధఘూర్ణితయైన వరూథినియును మనకుఁ బ్రత్యక్షమైనారు. త్రోపువడి అవమానింపఁబడినను వరూథినికి ప్రవరునిపైఁగల మోహము తగ్గలేదు. అతఁ డెడఁబాసినను వరూథిని కాతనియందు భ్రమ తగ్గలేదు. త్రోవ తెలియదన్నవాఁ డెక్కడికి పోఁగలఁ డన్న ధైర్యము. మరల తిరుగక పోవునా యన్న ఆశ. ఈరెండును వరూథిని నిట్టుచేయుచున్నవి. ఇటువంటి అవస్థలో మాయాప్రవరుఁడు పుష్పాపచయవ్యాజమున నవతరించినాఁడు. సంక్షుబ్ధములగు ప్రాణములు వరూథినికిఁ గుదుటపడినవి. మోహముగ్ధయై అతఁడు పెట్టిన కట్టడ లన్నిటికి నంగీకరించి అతనిని పొందినది. ఇంతటితో వరూథినీప్రవరులనుగూర్చిన ఘట్టము ముగియుచున్నది. ఇందు రసపోషణమున కేమాత్రము లోపము లేదని తేలుచున్నది.

ఈ పూర్వకథాభాగములో నొక యసందర్భము కనుపట్టుచున్నది. ప్రవరుఁడు మార్గాన్వేషణ మొనర్చుచుండ ఋషు లెవ్వ రాతని కంటఁ బడి యుండలేదు. ఒక్క వరూథిని లతాగృహము మాత్రమే అతనికి దృగ్గోచర మైనది. వరూథినీప్రవరుల సమావేశముకొఱకు అది వఱలో నున్న ఋష్యాశ్రమములు మాయమాయెనా! లేక ఋష్యాశ్రమములే లేవా? లేనిచో ఋషులు స్వారోచిజననకాలమునం దెక్కడ నుండి వచ్చిరి? స్వారోచి పుట్టుటతోడనే అతని జాతకర్మవిద్యాభ్యాసాదులకై ఋషు లాప్రదేశమున నిండినారు కాఁబోలును!

ఉత్తరకథకు నాయికానాయకులు మనోరమయును స్వరోచియును. మనోరమను స్వరోచితో సంధింపఁజేయుటకు వేట యవసరమైనది. ఘోరరాక్షసునిచేఁ దఱుమఁబడి మనోరమ విశ్రాంతుఁ డగు రాజును శరణువేఁడినది కదా! భయవిహ్వలచిత్తయైన మనోరమ స్వరక్షణార్థ మతని నర్థించుటకు ఒమలుఁగ తన పుట్టుపూర్వోత్తరముల నేకరువుపెట్టుట ఏ మంతయుచితము? ఈవర్ణనమువలనఁ దనగొప్పతనమును చూచి స్వరోచి రక్షించు ననియా? శుద్ధవీరుఁడు శరణాగతులను వంశోన్నతినిబట్టియా రక్షించును? సహజముగనే యాతఁడు శరణాగతులను రక్షించునుగదా! లేనిచో-స్వచరిత్రము విన్నతరువాత తనపై జనించిన అనురాగప్రభావ మతనిని రాక్షసునితోఁ బోరుటకు పురికొల్పుననియా? మఱియును మనోరమనుండి మంత్రము గ్రహించి దానవుని సంహరించినటు లున్నది. ఈయంశమువలన స్వరోచిశౌర్యమునకు కళంకము కలుగుచున్నది. మనోరమ దన చరితమును ప్రథమముననే చెప్పక దానవుని వధానంతరము చెప్పిన నెంతయో రమ్యముగ నుండెడిది. మఱియొక సంశయము కూడ కలుగుచున్నది. దానవుఁడు వెంటాడుచున్నప్పుడు స్వచరితమును చెప్పునంతటి యవకాశ మెట్లు కల్గినదో గదా! మఱియును హఠాత్తుగ రాజునకును దానవునకును కలహము సంభవించినయెడల సంభ్రమాశ్చర్యములు కలిగెడివి. స్వరోచి బాహుబలము వెల్లడి యయ్యెడిది. ఇప్పుడన్ననో దానవుని సంహారము స్వరోచిశక్తినుండి తొలఁగి మనోరమమంత్రముపై నాధారపడినది.

మనోరమ చెలికత్తెలు తమతమ విద్యలను స్వరోచికిచ్చి వానిని వివాహమాడిరి. అనఁగా రాజు విద్య నాసించి వారిని పరిణయమైనట్లున్నదేగాని ప్రేమచేఁ గాదని తేలుచున్నది. పోనీ తమ రుజను మాన్పినందులకు వారు స్వయముగనే ఆవిద్య నాతని కిచ్చిరనుకొందము అటులైనయెడల వివాహానంతర మీయఁగూడదా? అప్పు డెంతో సమంజసముగ నుండును కదా. విభావసి యేమనుచున్నది? నా విద్య తీసికొని నన్ను పెండ్లిచేసికొమ్మనుచున్నది. చక్రవాకి వీరినందఱఁ బరిహసించుచున్నది. జలవిహారసందర్భమునందు చక్రవాకి యొసర్చిన బహుభార్యాసాహచర్యనిషేధమును వినియు మఱల నెప్పటియట్లు చరించుటయును నది రాజుమనోదౌర్బల్యము సూచించుచున్నది. రాజునకు పక్షిభాష నేర్పినది విభావసి. పక్షులు మాటలాడినప్పుడు విభావసి అచ్చటనే యున్నది. ఈ పక్షుల హేళనను ఆమె గమనింపకుండుట ఈవింతలో మఱొకవింత. ఈ కథాసందర్భమును ప్రధానచరిత్రలో చొప్పించుట నిరర్థకమైనది. ఏమనఁగా నందువలన స్వరోచిప్రవర్తన మేమియును మాఱలేదు.

ఇఁక నిందలి కవితామాధుర్యముఁ గూర్చి ఇంచుక చర్చింతము. వర్ణనాసమర్థ్యము లగు పదగుంఫనలు పదములకుఁ దగిన మార్దవమాధుర్యములు- అందుల కనువు లగు సమాసప్రయోగములు- సామెతలు- ఈ గ్రంథరాజమునకు పెట్టని భూషణములు. ఉదాహరణార్థమై ఈ క్రింది పద్యములను చిత్తగింప వేఁడెదను:

మ. బహురత్నద్యుతి మేదురోదర దరీభాగంబులం బొల్చి ని
మ్నహికాహార్యమునన్ జరింతు మెపుడున్ బ్రేమన్ నభోవాహి
లహరీశీతల గంధవాహపరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లివి మత్కాంతారసంతానముల్.

మ. పవమాన ప్లవమాన కైతకరజఃపాళీ పిశంగచ్ఛవీ
భవదభ్యర్ణవికీర్ణ కృత్రిమ సరిత్పాద...రంగాహతైం
దవపాషాణ వితర్దికాతలమునన్ నాళీకపత్రాక్షు లు
త్సవ మొప్పన్ విహరించుచున్ సరసవాచాప్రౌఢిమల్ మీఱఁగన్.

మఱియు నిందలి వర్ణనలు స్వాభావికములై భావనాశక్తి విలసితములై యున్నవి. ఒకటి రెండు ఉదాహరణములు చూడుఁడు.

చ. మరున కొసంగఁ గాలము తమశ్ఛట గాటుకగా నవోదయ
స్ఫురదరుణ ప్రభాపథిక శోణిత సిక్తసితోడుభక్తమున్
హరిహయదిఙ్నభస్స్థలమునన్ బలిచల్లికటాంకమున్ వసూ
త్కరభరితంబునై వెలుఁగఁ గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్.

చ. పలుకులు నేర్పువేళ కలభాషిణి నీ విటులుండఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళిఁ గోకుచున్
నిలుగుచు నావులించుచు వనీ విహగోత్కరమెట్లు వల్కెనో
ప్పులుకులె యట్టు లెత్తి విని పల్కెడు వింటివె కీరశారికల్.

ఇట్టివి లెక్కకు మిక్కిలి యున్నవి. వానిని గుఱించిన రసానుభవమును పాఠకులే స్వయముగ నిర్వహింప నర్హులు.

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్.

ఈ పద్యము కవిప్రతిభావిశేషము వెనోళ్లఁ జాటుచున్నది. ముమ్ముందు నిర్మాణ మొనర్చు పెద్దనమహాకవి శృంగారసౌధమున కిది ప్రథమసోపానము. దగ్గఱకు వచ్చుటతోనే మన మెక్కఁబోవుచున్నది శృంగారసౌధము కదా యని పాఠకులకు వెంటనే స్ఫురించును. అటులు స్ఫురింపఁజేయుటయే కదా కవితాలక్షణము! ఇందులో నిమిడ్చిన విషయములు శృంగారరస సాధనములు. అందులకు నిలయమైనది మగువపొలుపు. నాయికను రంగములోనికి సమయోచిత సాధనములతోఁ బ్రవేశపెట్టిన కవిప్రతిభామాహాత్మ్య మసాధారణము.

క. తెలతెల వేగిన నగ్గిరి
జలజలఁ బ్రవహించు సెలల చప్పుళ్లు శిఖా
వలకుల కల కల కేకల
కలములు గల తలపొలంబు కనుఁగొను వేడ్కన్.

ఈపద్యము చదువుటతోడనే కొండ చరియలనుండి ప్రవహించు సెలయేళ్లు-ఆ సమీప ప్రాంతముల విహరించు నెమళ్లు-వాని మనోహర ధ్వనులు-కండ్లకు కట్టిన ట్లుండును.

చిత్రకారుఁడు చిత్రఫలకములచే వస్తుప్రదర్శనము చేయును. కవికవితా రూపమున వస్తుప్రదర్శనము చేయును. పద్యముచదువుటతోడనే చిత్రనైపుణ్యమందు విశద మగుచుండును. చిత్రకారునకును కవికిని గల భేద మిదియే. ఇద్దఱిభావములును సమానములే. కాని భావప్రదర్శనము వేర్వేఱురూపములఁ దాల్చుచున్నది. చిత్రకళాసౌందర్యము వెల్లివిరియుచుండునదే కవిత్వము కదా! వరూథినీగృహవర్ణనము ఈ పైవాక్యమునకు నిదర్శనముగాఁ గైకొని చూపెదను.

శా. తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు శిరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావాకల్పిత కాయమాన జటిలద్రాక్షాగుళుచ్ఛంబులన్
బూవుం దీవెల నొప్పు నొక్క భవనంబున్ గారుడోత్కీర్ణమున్.

# నవలా సారస్వతము

అ. వేంకట శాస్త్రి గారు

నవల యన స్త్రీ యని యర్థము గలదు. నవలలు అనఁగా-సాధారణముగ జనుల కందఱ కర్థమగు సులభశైలిలో స్వేచ్ఛగల వచన రచనాచమత్కృతితో విరాజిల్లుచు, సాంఘిక నైతిక చారిత్రిక పౌరాణిక అపరాధపరిశోధక ప్రభృతు లగు సాంప్రదాయముల త్రోవలను బట్టి రచింపబడిన గ్రంథములు "నదీనాం సాగరో గతిః" అన్నట్లు నవలలు ఏసాంప్రదాయములనుబట్టి రచింపఁబడినను అవి జనసామాన్యము నాకర్షింపఁగలిగినయెడల నవలారచనాశైయము చాల వఱకు నెఱవేఱిన ట్లెంచవచ్చును. నవలలలో స్త్రీలే ముఖ్యపాత్రములుగ నుండి యాముఖ్యపాత్రముల కన్ని దిశలను, పుష్పములోని రేకుల వలె పురుషులుకూడ పాత్రలుగ నుండునట్లు రచింపఁబడినవి. కొన్ని కొన్ని నవలలకు ముఖ్యపాత్రలుగా పురుషులే యుందురు. స్త్రీ లట్టి నవలల యందు ముఖ్యపాత్రలుగా గైకొనఁబడకుండుటకు కారణ మాగాథ యందు పురుషుల పాత్రౌచిత్యమును బట్టి ప్రాధాన్య మియ్యఁబడియుండుట నాటకమునకు నవలకు భేద మెందుఁ గనఁబడుచున్న దన నాటకమున ననేకపాత్రధారులను కవి యొకరితో నొకరు మాటలాడునట్లు చేయును. అవ్విధమున వారిచే మాటలాడించినపుడు గ్రంథకర్త తానే యాపాత్రలవేషములను ధరించినట్లు తలఁచి యాపాత్రల యౌచిత్యమునుబట్టి తద్ద్వారా మాటలాడును.

నవలాకథావిధానమో చాల చమత్కారమైనది. కవి యొక్క మనస్సను సరసురాలైన యొక ముద్దుగుమ్మ (విద్యావతియు, సరసురాలును అగు భార్య యందు, సౌహార్దముతో) నవలాపాఠకుఁడను ప్రియుని హస్తమును పట్టుకొని అతఁడు చూచియుండని-తా నిది వఱకు చూచినట్టిది అగు నొక యుద్యానవనమునఁ గొనిపోవుచు త్రోవలోని సౌందర్యములను చూపుచు పాఠకుని మన స్సానందడోలికలో నూపఁబడునట్లు తోఁపఁజేయుటచే సర్వమును మఱచి త్వరలో గమ్యస్థానమునకు నన్ను జేర్పవే! ముద్దియా! యను నుత్కంఠ పాఠకునికి గలుగఁజేయగల యట్టిదే నిజమైన నవల.

నవలల యాకర్షకశక్తి ప్రపంచమున ప్రతివస్తువును ఏదో యొకవిధమున మనుజుని నేత్రములను తనవైపున కాకర్షించుకొనఁ గల్గును. పుష్పముల మూలమున వృక్షము తన సంతతిని వృద్ధిచేసికొను స్వభావమును గల్గియున్నది.

పుష్పము, కాయగా పరివర్తనమునొందుటకు పురుషపుష్పములోని పుప్పొడి యొక స్త్రీపుష్పములోని కీలాగ్రమునఁ బడవలయును. పుష్పములు కీటకములను తేనెటీఁగలను తమకడ కాకర్షింప శక్తిఁగలిగి యుండవలయును. అందుచేతనే సృష్టిలో గల పుష్పము లన్నియు మనకు నేత్రోత్సవమును గలుగఁజేయుచు వివిధవర్ణములతో విరాజిల్లుచున్నవి. పుష్పముల రేకులు వివిధములైన రంగులు గలిగియుండుటలో గొప్పయుద్దేశము గలదు. కీటకాదు లాపుష్పముల రంగులచే నాకర్షింపఁబడుటయు, వానిచే తెలియబడకుండ వానికాళ్ల కంటుకొనుటచే పుప్పొడి గొనిరాఁబడి పుష్పములోని కీలాగ్రమునఁ బడుటయు, నంత పుష్పము తనయొక్క జీవితోద్దేశము నెఱవేర్చుకొనుటయు నగును. ఇదే విధముగ స్త్రీలు తమసహజసౌందర్యమునకు కొంచెము వన్నెఁ బెట్టు భూషణాంబరములతో తమ భర్తనకు మనోహరలుగ కనఁబడునట్లు ప్రయత్నించు స్త్రీలు కులధర్మపత్నులని యొక మహామహుఁడు వచించెను. నవలలు కూడ తమ సహజ వర్ణనా గాంభీర్యము గల ప్రకరణములతోడను, మార్దవమై, మానసములను రంజించు శైలితోడను, కథారచనా చమత్కృతితోడను, సాలీడుతాను తినదలచిన పురుగును తాను నిర్మించుకొన్న గూడుమీఁదకురాగానే యెట్లు పట్టుకొనునో యట్లే పాఠకునికూడ పట్టుకొని యతని మానసమును తుదివఱకు గొనిపోఁజాలి యుండవలయును. ఇదియే నవలకుఁగల యాకర్షకశక్తి. అందులకే నవలాగ్రంథకర్తలు తాము నవలలను రచించునపు డానవలలలో మొట్టమొదటి ప్రకరణములు పాఠకున కెట్లాకర్షకములుగ నుండునో, తమబుద్ధికి తోఁచినకొలది, వాని నాకర్షకములుగా నుండునట్లు చేయుదురు. కొన్ని నవలలలో మొదటి ప్రకరణములు విసుగుగలిగించునవియైనను క్రమముగ చదువుచుండఁగా మన కసహ్యముగ కనిపించు గొంగళిపురుగు కాలక్రమమున నింపుగులుకు సీతాకోకచిలుకగా మాఱు పందమున యొకనవలలో మొదటి ప్రకరణములు చదివినకొలది, యానందసంధాయక మగు కథాభాగము వచ్చునట్లు వ్రాయఁబడిన కొన్ని నవలలు గలవు. చక్కని స్వభావవర్ణనలతో ప్రారంభింపఁబడిన నవలలు పాఠకులను వడిగా చివఱకుఱకు గొనిపోఁగల్గును. ఇంగ్లీషుభాషలో రైనాల్డ్సు వ్రాసిన నవలలను చదువ నారంభించితిమా యందలి భాషాశైలి, మెల్లమెల్లగ, పాఠకుని సమ్మోహింపజేసి, నవలాంతమువఱకుఁ గొనిపోఁగల్గును. కొంద ఱాధునికులు రైనాల్డ్సునవలలు చదువఁదగినవి కా వనియు, యవి శీలభంగకరములనియు నందురు. కాని చదువువారు, యుక్తాయుక్తవిచక్షణ గలవారైన నట్టి దోషములు వారి నంటవు.

స్వభావవిరుద్ధములు, నన్యోన్యవైరుద్ధ్యములు నగు పాత్రలును, సంభాషణలును జొప్పింపఁబడిన నవలలు సైతము సహజముగ మన కాలి పాదములు పెరిగినపుడు గల సౌందర్యములకంటె కాలిపాదములు పెరుగకుండ చిన్న బూట్సుజోళ్లలో నిఱికింపఁబడిన నెక్కువ శృంగారముగ నుండు నని తలంచు చీనావారిపాదములవలెనే కొన్ని

యతిప్రయత్నముచే నల్లఁబడినపద్యములు నుండును. మన మాజోళ్లలో నిరీక్షింపఁబడిన చీనావారిపాదములను చీనావారిదృష్టితో పరికింతుమేని యవి యందముగ తోఁపవచ్చును. అట్లే, యసహజములును, సులభముగ నమ్ముటకు వీలులేనివియు నగు సంగతులను వ్రాసినగ్రంథములలో నాగ్రంథకర్తృదృష్టితో చూతుమేని యట్టివి పొడకట్టవు. కాని చక్కని విమర్శకదృష్టితో మనము చూతుమేని సహజములును అసహజములు నగు వర్ణనములను నవలలలో పరికింపఁగలము.

రసపుష్టి:— నవలలలో నవసరములలో కొన్నిటినైన వీలైనంత పుష్టినకు పోషింపఁ జూడవలయును. మనోజ్ఞముగ, తనభావములను వెల్లడింపఁగలవానికి వచనములోఁగూడ నవరసములలో కొన్నిటినైన చిప్పిలునట్లు చేయవచ్చును.

సాధారణముగా మనహిందూదేశములోనినవలలు కష్టములయనంతరమున కథానాయకులు సుఖములఁబొందినట్లు రచింపఁబడును. ఇంగ్లాండుదేశపు కొన్ని నవలలలో నవలాంతమున హత్యలతో, కష్టములతో ముగింపఁబడును. అందుచే పాఠకుఁ డట్టినవలను చదివినచోఁ దుదకు దుఃఖకరమైన వర్ణనల నవలాతుదిభాగమున నుండువాని నసహ్యించుకొనును. కొందఱు తాము చదువునవల తుదకు హత్యతో ముగిసె నని విచారమనస్కు లయ్యెదరు.

మంచి సాంఘికనవలలును, దేశరాజకీయపరిస్థితులను వర్ణించు నవలలును దేశములోని వారి నభ్యున్నతిదశకు గొని రాఁగల్గును. దేశమందంతటను నట్టి మంచినవలలు బయలుదేఱవలయును. ప్రస్తుతము అసహాయోద్యమమును గూర్చి నాటకము లెట్లు రచింపఁబడినవో అట్లే నవలలరూపమున వ్రాయఁబడి దేశస్థితిగతులను వర్ణించునవలలు ప్రజలలో నుద్బోధముగలిగించుట కవశ్యములు. నవలాసారస్వత మను పేటికలో అపరాధపరిశోధక, వత, చరిత్రాత్మక, సాంఘిక, రాజకీయ వ్యవస్థలవర్ణన లుంచబడి భద్రము చేయఁబడవలెను. సోమరాజు రామానుజరావుగారను నొక నవలాగ్రంథకర్త లామధ్య మనప్రభుత్వము వారికి యుద్ధములో జయము గలిగినపు డాజయమును సూచించుటకు 'విజయధ్వజ' మను నవలను వ్రాసిరి. అట్లే ప్రస్తుతపు మననవలారచనాదక్షులు, మనదేశస్థితులనుగూర్చి నవలారూపకముగ, నవలా యుపన్యాసధోరణితో, తేటతెల్లముగ రచించుట దేశహితైకకార్యము. నవలానిర్మాణకౌశలు లిట్టి నవలాసారస్వతమును సృజించి యావిధముగ దేశసేవను జేసి ధన్యు లయ్యెదరు గాక!

# ఆంధ్రభాషాప్రశంస

ఏ. వి. నరసింహము పంతులు గారు

వేదకాలమునాఁడె ♦ విశ్రుతిఁ గాంచి
వేదప్రసిద్ధమై ♦ వెలయు నాంధ్రంబు
అదియ ప్రాకృత మను ♦ నభిధాన మొందె
నదె పల్కు వెలఁది బా♦ల్యమునాఁటి బాస
గొనకొని వైదికో♦క్తులఁ గూడి యాంధ్రి
ఘనవైదికార్య సం♦స్కార యై తనరె
ఆంధ్రంబ యటు లౌట♦నగును సంస్కృతము
ఆంధ్రి ద్రావిడవాణి ♦ యాంధ్రికర్ణాటి
వినుతుఁడౌ శ్రీరామ ♦ విభునికాలమున
ననుపమానస్థితి ♦ నమరె నాంధ్రంబు
ఆంధ్రవిష్ణునసుజ్ఞ ♦ నాకణ్వమునియు
నాంధ్రవ్యాకృతిఁ జేసి ♦ యతిధన్యుఁ డయ్యె
ఘనుఁడైన యయ్యశో♦కక్ష్మాతలేంద్రు
ననవద్య శౌర్య వి♦హారంబుతోడ
బౌద్ధమతావాప్తి ♦ ప్రబలుకాలమున
నిద్ధయశోవ్యాప్తి ♦ నెసఁగె నాంధ్రంబు
చోళ చాళుక్య వి♦శ్రుతసమీకముల
చోళప్రతాపాగ్ని ♦ స్రుక్క వాఙ్మయము
చాళుక్యవంశ వి♦స్తారుండు ఘనుఁడు
చాళుక్య రాజరా♦జనరేంద్రచంద్రుఁ
డాచంద్రతారార్క♦మై కీర్తిలతిక
ప్రాచీదిశం బుట్టి ♦ పర్వ దిగ్వితతి
దన్నుద్ధరింపంగఁ ♦ దనరె నాంధ్రంబు
సన్నుత వైదుష్య ♦ సంపన్నులైన
సత్కవీంద్రులు దన ♦ సరసతఁ గాంచి
యాత్కంఠ్యమునఁ గొల్వ ♦ నలరారె నాంధ్రి
ప్రాకృత సంస్కృత ♦ బంధవేణులును
శ్రీకారవదనలు ♦ చెన్నొందు మత్త
కోకిలాలాపలు ♦ కుసుమవిచిత్ర
ప్రాకటగాత్ర శో♦భావతుల్ సఖులు
మత్తవిక్రీడితల్ ♦ మంజుభాషిణులు
మత్తేభగమనల్ సు♦మంగలీమణులు
మహి మహోత్సుకతను ♦ మధ్యసుందరులు
సహిఁగ విరాజ వి♦రాజితకావ్య
ధన్యకామిను లుట్టఁ ♦ గానాచి యగుచు
దన్యత్వమున మించు ♦ ధరణి నాంధ్రంబు
మార్దవ మాంధ్రంబు ♦ మధుర మాంధ్రంబు
హార్దమై శ్రావ్యమై ♦ యాంధ్రంబ తనరు.

# శ్రీ మద్ధన్వంతరి ఆశ్రమం

## నూజవీడు

మనదేశమేది ? మనమేసంతతివారము ? మన ప్రాచీనులొనరించు కార్యములెవ్వి? యని విచారింపుడు! దానితత్వము మీకు గోచరించును.

దీర్ఘ సుఖజీవితమునకు అటంకమగు రోగజాలములనుండి రక్షించునది ఆయుర్వేదము. ఆయుర్వేదము అతి ప్రాచీనమై ఋషివరుల సంభూతమై, అంత్యములేనిదై, అపారమహిమగలదై యలరారుచున్నది.

## చక్రదత్త

అమూల్యమైన మూలికా వైద్యగ్రంథము. ఆంధ్రతాత్పర్యసహితము. ఇట్టిసులభమైన మూలికాయోగ సంకలితమగు వైద్యగ్రంథము వేరొకటిలేదు అందరు చదువదగినది. పోస్టేజిగాక పూర్వభాగము బైండు రు 3-4-0 ఉత్తరభాగము బైండు రు 3-4-0 రెండుభాగములు ఒకేసారి కొనువారికి పోస్టేజితో సహా రు 6-0-0. శ్రీధన్వంతరి వ్రతకల్పము రు 0-4-0. శ్రీధన్వంతరి దండకము వుచితము.

## ఖండామ్రకరసాయనం

అనుభవసిద్ధమైన భార్గవఋషి ప్రోక్తము

చక్కగా పండిన మామిడిపండ్లరసముచే శాస్త్రోక్తముగా జేయబడినది. ధాతుపుష్టికి దీనికిమించిన ఔషధములేదు, మందత్వమును బోగొట్టి, యౌవనమును గలుగజేయును, మరియు క్షయ, శ్వాస, కాసలు, గ్రహపీడ, అపస్మారము, ప్రమేహము, మూత్రకృచ్ఛ, హరింపజేసి, శరీరకాంతి, బుద్ధిబలము, ఆయుర్వృద్ధిగలుగజేయును- వెల శేరు - డబ్బీ 1 కి రు 4-0-0 వివరములు గోరువారికి క్యాటలాగు వుచితము.

## "ఆయుర్వేద వైద్య"

### వి. రామజోగిరాజు

శ్రీమద్ధన్వంతరి ఆశ్రమం

నూజవీడు, క్రిష్ణాజిల్లా.

లక్ష్మీనారాయణ కంపెనీవారి సుప్రసిద్ధౌషధములు

## భృంగామలక తైలము.

ఇది బజారులో విక్రయింపబడు ఆమలకముల వంటిది గాదు. శాస్త్రోక్తప్రకారము మిక్కిలి జాగరూకతతో తయారు చేయబడినది మెదడుకు సంబంధించిన సకలవ్యాధులను ఖండించి కండ్లకు చలువ గలుగజేయును. సకలమైన తలనొప్పులను మాన్పును. శరీరారోగ్యము నపేక్షించు ప్రతివారును అభ్యంజనమునందు తప్పక వాడదగిన తైలము. సీసా 1-కి 1-0-0

## కస్తూరి మాత్రలు.

జలుబు, దగ్గు, కఫము, తలనొప్పి యిత్యాదులు, జ్వరములు, కడుపులో చేరిన వాయువులు వగైరా యావత్తు వ్యాధులకు అన్ని కాలములలో వాడవచ్చును. బిడ్డలకు సదా ఆరోగ్యకారి. వారివారి దేహతత్వ మెరిగి 1 మొదలు 3 వరకు పూటకు వాడుకోవచ్చును. అల్లపురసం, తేనె, సొంటియిత్యాది అనుపానములతోనున్ను వాడవచ్చును. 100మాత్రల సీసా అ. 12

## పుదీనా షర్బత్తు.

పిత్తమును శాంతిపజేసి ఆకలిని హెచ్చించును. మలజలములు చక్కగా జారును. నోటి అరుచిని పోగొట్టి వాయువును ఖండించును. నిదురమేల్కొను విద్యార్థులు మొదలగువారికి ఉపయోగము. ఒక టీస్పూను నీళ్లలో కలిపి దినమునకు రెండుమార్లు పుచ్చుకొనవచ్చును. బుడ్డి 1-కి 1-8-0 మింటుమాత్రలు 100-కి రూ 1-0-0.

## అశ్వగంధి రసాయనము.

ఇది యొక సుప్రసిద్ధమైన యౌషధము. శరీరమునందలి రక్తమును శుద్ధిజేసి బలమును కలిగించుటయందు దీనికి మించిన ఔషధము వేరులేదు. పసిబిడ్డల కుపయోగించినచో సకలకారకములను హరించును. ఒక శేరు మందువల్లనే గుణము తెలియగలదు. వెల సేరు డబ్బి 2-0-0

## నారాయణ దంతచూర్ణము

ఇది ఆయుర్వేదశాస్త్రము ననుసరించి తయారుచేయబడినది. పండ్లనొప్పి, పండ్లుకదలుట, చిగుళ్ళవాపు, పండ్లయందు రక్తము కారుట. దుర్గంధము మొదలగువాటిని తప్పక నివారించును. దంతములను దృఢపరచును. 1½ నెల వాడుకొనదగిన డబ్బీలు 12-కి రు 4. 2-నెలకగు పొట్లములు 12-కి రు 2.

## బాదం షర్బత్

రక్తవృద్ధి చేయును, ముఖకాంతి నిచ్చును, నాడులకు బలము నిచ్చును, మలబద్ధకము మాన్పును, నిగ్గుచేకూర్చును, బలహీనతపోవును. నీళ్లతోనున్ను, పాలతోనున్ను సేవించనగును. తాపములు తీరును. 1 టీస్పూను మొదలు 2,3 వరకు వాడుకోవచ్చును. ధాతుపుష్టిని కలుగజేయును. మనోబలముగా నుంచును. రుచిని ఇచ్చును. క్రయం బుడ్డి 2-0-0

లక్ష్మీనారాయణ అండ్ కో.

తక్క కృష్ణప్పనాయుని అగ్రహారం, మదరాస్.

నామూలం లిఖ్యతే కించి న్నానపేక్షిత ముచ్యతే అన్వయముఖమున నే సర్వమును వ్యాఖ్యానము చేసెదను. మూలములేనిది కొంచెముకూడ వ్రాయను. అనావశ్యక మయినది చెప్పను"—అని మల్లినాథుని శపథము ఈశపథము తప్పకుండ నే యాతఁడు వ్యాఖ్యానరచనముఁ గావించెను. కాళిదాసాది మహాకవుల కావ్యములకును నింక నితరశాస్త్రగ్రంథములకును సమర్థము లయిన వ్యాఖ్యలు రచింపఁబూనువానికి ప్రాచీనము లగు సర్వవిద్యలందును సంపూర్ణపరిజ్ఞానము కావలసి యుండును. కణాదగౌతమ తర్కములందు- పూర్వోత్తరమీమాంసలందు- వ్యాకరణమందు- సాంఖ్యయోగముల దు- జ్యోతిషము దు- నింక నితర విద్యలందు- మల్లినాథుఁడు మహాపండితుఁడు. పదవాక్యప్రమాణపారావారపారీణుఁడని-మహామహోపాధ్యాయుఁడని- యాయన బిరుదములు. "కోలాచలాచార్య:" అన్నట్లుగా నెన్నివిద్యలభ్యసించినను ప్రసక్తి కల్గినప్పుడు పరిశోధించుటకుఁ దగినంత గ్రంథసంచయముకూడ నుండినఁగాని సర్వాంకషమగు వైదుష్యము సమకూడదు. మల్లినాథుఁడు తనగ్రంథములందు ననేకప్రాచీనగ్రంథముల నుదాహరించెను. అన్నిగ్రంథముల నాతఁ డెట్లు సంపాదించెనో యాశ్చర్యావహముగా నున్నది. పూర్వులు పరంపరగా గొప్పవిద్వాంసు లగుటచేత వారువారు ఆర్జించిన గ్రంథసంచయము కొంత యింటనే యీతనికి లభించి యుండును. అది గాక కాకతిరుద్ర సర్వజ్ఞసింగభూపాలుర సంస్థానములతో సంబంధముండుటచేత నక్కడి సరస్వతీభండాగారములును దొరకియుండును. ఈయన తన వ్యాఖ్యలం దుదాహరించిన గ్రంథము లనేకము లిపుడు లభించుట లేదు. కొన్ని యిట్టివనికూడఁ దెలియరాక యున్నవి. ఉదాహరణముగా నొకటిరెండు తెల్పెదను. సంగీతశాస్త్రవిషయములు వచ్చినప్పు డీయన వ్యాఖ్యానములందు 'తథాచ మతంగః' అని యుదాహరించినాఁడు. తెలియక ముద్రాపకులు కొందఱు 'మాతంగః' అని ముద్రించిరి. మతంగుఁడో మాతంగుఁడో సంగీతశాస్త్రమున నేమి గ్రంథము రచించెనో యెవ్వరికిని దెలియరాకుండెను. ఈనడుమ శ్రీ మానవల్లి రామకృష్ణకవి (ఎం. ఏ.) గారు తంజావూరి రఘునాథరాయని సంగీతసుధలో "గ్రంథ బృహద్దేశ్యభిధం మతంగమునిప్రణీతం నిపుణం విలోక్య" అని యుండుటను బరిశీలించి తిరువనంతపురము రాజపుస్తకశాలవారి రిటీరుల సంపాదించిన బృహద్దేశిగ్రంథభాగము మల్లినాథుఁ డుదాహరించిన మతంగకృతగ్రంథముగా గుర్తించిరి. మఱియుఁ గొన్నిచోట్ల "తథాచ చాక్షుషః" అని యున్నది. ఈ చాక్షుషుఁ డెవరో ఏమిగ్రంథము రచించెనో తెలియదయ్యెను. ఇది రాజనీతిగ్రంథ మని శ్రీకవిగారే గుర్తింపఁగల్గినారు. మల్లినాథుఁ డుదాహరించిన మహాయాత్ర యను గ్రంథ మిట్టిదని యిదివఱకెఱుఁగరాకుండెను. అది యిప్పుడు ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు లభించినది. కామనగ్రంథ మ్పారచర్యయను రాజవృత్తియను పేరులుగల గ్రంథము లిప్పుడు దొరకకున్నవి. ఉభయమీమాంసలందును నుభయ తర్కములందును ప్రాచీనగ్రంథము లీయన యుదాహరించినాఁడు. చార్వాకబౌద్ధగ్రంథముల నుదాహరించినాఁడు. అందుఁ గొన్ని యిప్పుడు కానరాకున్నవి. పంచకావ్యవ్యాఖ్యలం దీయన దక్షిణావర్తనాథుఁ డను నొక ప్రాచీనవ్యాఖ్యాతను - "నాథవచన మనాథవచన మేవ" ఇత్యాదివిధముల గర్హించినాఁడు. దక్షిణావర్తనాథునివ్యాఖ్య లిప్పుడు దొరకినవి.

మల్లినాథుఁడు రచియించిన గ్రంథము లివి తెలియవచ్చుచున్నవి.- రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశ, కిరాతార్జునీయ, శిశుపాలవధములను పంచకావ్యములకు వ్యాఖ్యలు. నైషధవ్యాఖ్య, భట్టికావ్యవ్యాఖ్య, ఏకావళివ్యాఖ్య, తంత్రవార్తికటీక, స్వరమంజరీ వ్యాఖ్య (?మశకము) తార్కిక రక్షటీక జ్యోతిష గ్రంథము, రఘువీరచరిత (?) రఘువీరచరితము మల్లినాథకృతి యగునో కాదో!

మీఁద నుదాహరింపఁబడిన చంపూరామాయణ వ్యాఖ్యాత శ్లోకములందుఁ బెద్దిభట్టు సర్వజ్ఞ సింగభూపాలునిచే (యాతులేయత్రతా? కృతా?) మేనమామ కుమారుని యాజ్ఞమునఁ గనకాభిషేకసత్కార మందిన ట్లున్నది. సర్వజ్ఞసింగభూపాలకృతియగు రసార్ణవసుధాకరము నీతఁడు తనవ్యాఖ్యలం దుదాహరించినాఁడు సర్వజ్ఞ సింగభూపా లని సమ్మానాభిమానము పెట్టు పెద్దిభట్టు చూపినాఁ డనుకొనుచున్నాను. పెద్దిభట్టు సర్వజ్ఞ సింగభూపతికాలమున నున్నవాఁ డనుటకు సాధకముగా నీ క్రిందిశ్లోకము వాకొకచోటఁ జేకూడినది:—

శ్లో. కిం వాససా చీకిరిబాకికరేణ కిం దారుణా వంకరటింకరేణ
సర్వజ్ఞభూపాల విలోకనార్థం వైదుష్య మేకం విదుషాం సహాయమ్.

పెద్దిభట్టొకనాఁడు చీఁకిరిబాఁకిరిచినుఁగుఁబ్రాత కట్టుకొని వంకరటింకర కఱ్ఱ చేతఁబట్టుకొని సర్వజ్ఞసింగభూపతి విద్వత్సభకుఁ బోవుచుండఁ ద్రోవలో నెవరో యడిగిరఁట. తాతగారూ! రాజసభ కిట్టి వేషముతోఁ బోవుచున్నారే యని. అప్పు డాయన పై శ్లోకము చెప్పెనట!

మఱియుఁ బెద్దిభట్టు గణాధిపప్రసాదము గలవాఁ డని చంపూరామాయణవ్యాఖ్యాదిశ్లోకములం దున్నది. రఘువంశాదివ్యాఖ్యలందుఁ బ్రధానముగాఁ జేసిన గణపతిస్తుతిశ్లోకము లున్నవి.

పెద్దిభట్టుపేర నీక్రిందికథలను గొందఱు చెప్పుచున్నారు. "పెద్దిభట్టుతోడఁ బుట్టఁడు ఘనాంతము వేదవిద్య నేర్చినవాఁడు. మంచి కంఠపుష్టి కలవాఁడు. పెద్దిభట్టు మంచిస ... సాహిత్యము శాస్త్ర పాండిత్యముఁ గలవాఁడుగదా! పెద్దయల్లుఁ డగు నా వేదమూర్ఖుఁడును చిన్నయల్లుఁడగు నీశాస్త్రచతురుఁడును నత్తవారింటి కొకకాలమున నొకప్పు డేతెంచిరి. అత్తమామలు పెద్దయల్లుని సలత్వముతో సగౌరవముతోను, చిన్నయల్లుని మన్ననతో మర్యాదతోను జూడసాగిరి. అతని వేదవైదుష్యమును వెక్కిరించి - యీతని శాస్త్రచాతుర్యమును సన్మానించిరి. అతనికి నడవలోఁ జాపమీఁదను నీతనికి బడుకగదిలోఁ బట్టె మంచముమీఁదను శయనవిధాన మేర్పఱిచిరి. పెద్దాతఁడు కోపమున గుములుచుండెను. పిన్నాతఁ డుత్సాహమున నుప్పొంగుచుండెను. పడుకగదినుండి రాత్రి లఘుశంకకు బయలికేగుచు నీపిన్నాతఁడు త్రోవలో నడవలోఁ బండుకొనియున్న తోడియల్లు నొకతన్ను తన్ని యెఱుఁగక ప్రమాదమునఁ దన్నినట్లు నటించి "క్షమధ్వమ్" అని

# * అసమాన దాంపత్యము

అనంతపంతుల వేంకటేశ్వర్లుగారు బి. ఏ., బి. ఎల్.

ప్రేతఁ డొక సామాన్యశిల్పియు
నామెయును సామాన్యబాలిక
యనుదినము నా రాడుకొను నే-కాంతకథ లేవో.

2. ఒక్కపండుగ దివసమున నా
రూరి యావలి గుడికిఁ జని "మే
ముందు మీపయి నాలుమగలగు-ననుచుఁ గలవరపున్.''

3. అనుచు దేవుని సన్నిధానము
నందు బాసలుచేసి ముదమున
నలరుచుండెడి వారియెడఁదల నలవిదే పొగడన్.

4. బాలికామణి తండ్రి గుడిసెను
వదలి భర్తకరంబు నానుచు
బాటఁ బడి చనుచుండె నాతప-బాధఁ దల లుడికెన్.

5. అలసటలఁ బొడమెడు శ్రమాంబుల
కనిక మూతఁడే విసరు; దేవత
లలరుజడిఁ గురిపించి రా ముద్దారు కనత్రోవన్.

6. పల్లెజోడులు పెండ్లిపాటలు
మోదమునఁ బాడంగ నాతఁడు
ముద్దుముచ్చట లాడు నిటు లా-ముదితమన మలరన్.

7. "ప్రేయసీ యాదె కలదు ప్రక్కను
విరులతోఁటం దెపుడు సుందర
భీ వారిజేక్షణలు బంతులు-వేడుకాడెదరు."

8. "రావకెన్నెలు వారి సొంబుసులు
ప్రాకృతుల మగు మన కవేలా?
త్రిభువనములందు నీసరి-రారు నాకెవరు."

9 మార్గమునఁ గనిపించు భవనము
తోయజాక్షి! ప్రభువుసదనము
తులయుఁ గా దది నాకు నీచేతోభవనమునకు.

10. ఆయన నందలి చిత్రముల నీ
కగపడఁగ మన మొక్కతడవ నా
నాగ్కశ్యముఁ గని విపులఁ బోవుద-మాత్మ్యప్రహామునకు.

11 త్రోవనుచనుట కెన్నొ యాతఁడు
తోయజాక్షికి విస్మయము సేయుచు
దొడ్డభవనముఁ జేర లోనికి-దోడుకొనిపోయె.

12. ద్వారపాలకుఁ డంత నాతనిఁ
దలిరుఁ బోడినిఁ జూచి చేతులు
తలను గీలించుచు వినయమున-దారిమునునడిచెన్.

13. కనకగోపురములను జిత్రా
కారముఁ బొపరండ్లఁ జంద్ర
గ్రావమంటపములను, జలమున్-గ్రక్కుయంత్రములన్.

14. వరుసగాఁ జూపుచును సేవక
వందనము లొందుచును మెల్లగఁ
బ్రాణనాయిక నడిపె నంత-స్సభగమున కతఁడు.

15 చూపులకు మిఱుమిట్లు గొలిపెడు
చోద్యముల నన్నియుఁ గనుంగొని
సుందరియు సంతసముఁ బొందదు-శూద్రజాతిసతి.

16. ఆమెనూరస వంతయును దన
యూరఁ గొండొడు కుటీరమే కన
నాత్మఁ దలఁచుచుండె నాతని-నందుఁ దనియుండెన్.

17. ఎట్టకేలకు నవ్వు చనుఁ బ్రా
ణేశు "డో నాప్రాణధనమా
యింతభాగ్యము నీది నాదే"-యెఱిఁగి తమిఁ గనుమా!

18. అతఁడె యీ ప్రభువు; భవనం
బాతనిదె; బహుభాగ్యయుతుఁడై
యచట కాఁపురముండు నాదే-శాధినాథుండై.

19. పాప! మీనిజ మెఱుఁగుటనె యా
పాదమస్తక మేది వన్నెలు
బాలికామణి విన్నఁబోయెఁ; ద్ర-పాతిశయమున నో!

20. విన్నఁబోయిన కారణము తా
నెన్నలేక యతఁడు నాతుక
కెన్నొ వలపుంబెద్దములఁ దన-మన్ననన్ దెలిపెన్.

21. మగనిముదమే భాగ్యవిధి యని
మదినెఱుంగుచు నాత్మ పదవికి
మానినీమణి యనుసరించె; క్రమంబుతోఁ దుదకు.

22. ఒండొరులఁ బ్రేమించుకొనుచు మ
హోన్నతిన్ మనుచుండ్రు దంపతు;
లుచిదగఁ జ్ఞానిధమె వర్తిలు-చుండెఁ; బ్రజ పొగడ.

23. అకట! ఘట్టుకతోడ నెఱుఁగని
యధిక గౌరవపదవి సుకుమా
రాంగి కలిగె నగ్ర్భరము యామ న-హార్నిశము వేచెన్.

24 ఎంత సుఖజీవనము దాఁటి
యించినను నానాటికిని బల
హీనమగుచుఁ గృశించు చిటు లూ-హించు నసువినము.

25 "ఆది నావ్యాదయంబుఁ బొందిన
యాలతి శిల్పియె మగుడ నాధుం
డైన నెంతో శాంతిఁ గల్గు న-వాత్మకో దేవ.

26. ఇట్లు చింతిల్లుచుఁ గ్రమంబున
నీల్గె నమ్మ్యరుబిడ్డలం గని
యెంతయున్ ఏకసింహకయె నశి-యించు మొగ్గటులు.

27. కంటికిన్ మంటికిని ధారలు
గట్టఁ గన్నీరొలికె యేడ్చుచు
కాంతుఁ డాత్మేశ్వరికళంబును-గాంచి యిటుపలికెన్:

28. "నన్ను బెండ్లియైన నాఁ డీ
నాతి తొడిగిన యొడుపులనె యీ
నాతి గప్పి శ్మశాననాటికి-నడుపుఁ డికమీఁదన్.

29. చచ్చిపోయిన ప్రాణసఖి వి
శ్రాంతి కల్గెను నంచు నేలిక
సలుప నాజ్ఞాపించినట్లు జరిపె భృత్యతతి

---

* టెనిసన్ మహాకవి "Lord of Burleigh" అను కావ్యమునకు స్వేచ్ఛాంధ్రీకరణము.

# ప్రకృతిశాస్త్రములు - ఆర్యధర్మములు

పెద్దిభట్ల వీరయ్య పంతులుగారు బి. ఏ. బి. ఎల్.

ఆర్యులధర్మములు పరమాత్మసృష్టములు. అవి ప్రకృతిశాస్త్రబోధల ననుసరించి యున్నవి. భారతవర్షమునందలి యాచారములు మత సంబద్ధములు. ఇతరదేశములందలి సాంఘికధర్మములకు నచ్చటి మతములకు సంబంధములేదు. రాజశాసనోల్లంఘనమునకే మరణాదిశిక్షలు విధింపబడుచున్నది ఇఁకను రాజాధిరాజుల కెల్లరకు సృష్టికర్తయగు దేవుని యాజ్ఞయెడల మానవకోటి యెట్టి భయభక్తులతో సంచరింపవలయునో వివరింప నవసరము లేదు. ఆర్యధర్మములు చిరకాలముగ నితరదేశములకు నాదర్శములుగ నున్నవి. కాని ఇపుడు కాలమహిమచేత మనధర్మముల రహస్యములు దురవగాహములైనవి. వాని యాచరణము నానాటికి క్షీణించుచున్నది అందులకు గల కారణమును చర్చింపనిది యదను కాదు. పూర్వమున నుండిన ధర్మములను- వానికిని ప్రకృతిశాస్త్రఫలితములకును నెట్టి సంబంధము గలదో యట్టి విషయములను- నీవ్యాసమునఁ గనబఱుపఁ దలచినాను. హైందవసంఘనిర్మాణము ప్రకృతిశాస్త్రపద్ధతులకు భిన్నము గాదనియు నార్యధర్మము లుత్కృష్టము లనియు పాశ్చాత్యశాస్త్రజ్ఞుల పరిశోధనలవలన దెలిసిన యంశముల నిందు బొందుపరచుచున్నాను.

ఉదయము నిదురలేచినది మొదలు రాత్రి నిదురపోవువఱకును మనుజుడు చేయవలసిన కార్యక్రమ మంతయును మన మహాగ్రంథములందు గలదు. మనశాస్త్రములలో నుషఃకాలమున నిదుర లేచి- కాల్యకృత్యములఁ దీర్చికొని- స్నానసంధ్యాదికముల నిర్వర్తించి- హోమమాచరించి- యతిథియభ్యాగతుల సత్కరించి- బలినొసర్చి భుజించుట బ్రాహ్మణ ధర్మముగ విధింపబడినది ఇదిగాక గృహమునఁ గసవు చిమ్మి యలికి ముగ్గు పెట్టుటయు నార్యధర్మములలో గలదు. మఱియు నాహారనియమములు వివాహనియమములు పారిశుద్ధ్యనిబంధన లనేకములు గలవు. వంశపారంపర్యముగ రోగల గుణగణములును వర్ణభేదముయొక్క ప్రాముఖ్యమును నందుఁగలవు. ఇట్టి విధు లన్నియు మతముయొక్క కట్టుబాట్లకు లోబడియుండుటచేత హిందూదేశమునందు మాత్రమే గలవు. పాశ్చాత్యదేశములం దట్టివిధు లున్నంతవరకు నాచారము ననుసరించి, యమలులో నున్నవి. మన పూర్వాచారములు నార్యధర్మములు కొన్ని ప్రత్యక్షముగ నర్థహీనముగ గన్పించుటయే గాక పాశ్చాత్యనాగరకత మనదేశమున వ్యాపించుటచేత మన దృక్పథమునందు కూడ మార్పు గలిగినది అవసరమగు సంస్కరణము లెట్లున్నను గొన్ని సంస్కరణలు మాత్రము మనసంఘముయొక్క పునాదికి భంగము గలుగునవి ప్రస్తుతము బయలుదేరుచున్నవి. ఇది కడు శోచనీయము. మన పూర్వాచారములను నిరసించువారు- పాశ్చాత్యశాస్త్రజ్ఞులు మః ధర్మములను గురించి- యెట్టి యమోఘవాక్యములను వ్రాసిరో తెలిసికొనుట ముఖ్యము.

అరుణోదయమునకు పూర్వమే నిద్రలేచు టేటికని మధ్యాహ్నమువఱకు నిద్రించువారు మనసంఘములో గలరు గదా. అట్టివారు పైడే యను శాస్త్రజ్ఞుడు వ్రాసిన సంగతులను గమనింపగోరుచున్నాను. మనజీవితములకు ముఖ్యాధారమగు ప్రాణవాయువు విశేషముగ నరుణోదయమందు విద్యుచ్ఛక్తిమార్పువల్ల నేర్పడుచున్నదఁట! వృక్షములు పగలు ప్రాణవాయువును ప్రతికూలవిద్యుచ్ఛక్తివల్లను రాత్రులందు భిన్నమగు గాలి ననుకూలవిద్యుచ్ఛక్తివల్లను వ్యాపింపజేయు నని శాస్త్రజ్ఞులు దెలుపుచున్నారు. రెండువిధము లగు విద్యుచ్ఛక్తులు ప్రాణవాయువుతో నెట్టి సంబంధము గలిగినది తెలిసికొన్నప్పుడు ప్రాణాధారమగునట్టి వాయువు విరివిగా ప్రకృతియందు చిక్కు నవకాశమును పోగొట్టుకొనుటకు ప్రాణవాయు తత్త్వ మెఱింగినవా రెవ్వరును ప్రయత్నింపరు గదా? వాయువు ప్రాణాధార మనియు నందు ప్రాణవాయువు తగినంత లేనిచో జాడ్యములు మృత్యువు తప్పవనియు నెల్లరకు విదితమే. కాబట్టి ఉషఃకాలమునందు నిద్రలేచుట మనవిధి యని మన ధర్మశాస్త్రములే గాక పాశ్చాత్యశాస్త్రజ్ఞులుకూడ నంగీకరించుచుఁ గారణమును గనఁబఱుచుచున్నారు. దంతధావన మనఁగ నేమో యెఱుఁగని హైందవు లెవ్వరును లేరు. ఒకవేళ నున్నచో అయ్యది పాశ్చాత్యానుకరణ మఁట! దంతధావనము లేనికారణమున నెందఱో దంతభగ్నులగుచు ముప్పదియేండ్లకే ముసలియాకారమును చెందుచున్నారు. కృత్రిమపుదంతముల నమర్చుకొనుట- కదలుచున్న దంతముల నూడలాగించుట- మొదలగు పనులయందు వీరికి విరామ ముండదు. చెట్టుపుల్లలనో కచ్చికనో యుపయోగింపక బ్రష్షుల నుపయోగించువారు కొందఱు గలరు. బ్రష్షువల్ల నెట్టియపాయము గలదో పాశ్చాత్యశాస్త్రజ్ఞులు దెలిపియున్నారు. ఎస్కిమోతెగవారిలో నూటికి నొక్కనికి హైందవులలో నూటికి 6 వంతున చైనావారిలో నూటికి 40 వంతున ఐరోపాలో నూటికి 90 వంతున దంతరోగములను గలిగియున్నారు. బ్రిటిషు మెడికల్ జర్నలులో బ్రషుల నుపయోగించుట హానికరమనియు నణుజీవు లా బ్రషులో చేరియుండుననియు నెప్పటికప్పుడు క్రొత్త బ్రషు నుపయోగింపవలసినదే గాని యొకమా రుపయోగించిన దానిని తిరిగి యుపయోగింపరా దని గొప్పడాక్టరు వ్రాసియున్నాఁడు.

అన్నివిధములగు శీతోష్ణస్థితి గల మనదేశమునందు ప్రతిదినము స్నానమాచరించుట కెన్నియో సదుపాయములను దైవము ప్రసాదించి యున్నాఁడు. పాశ్చాత్యదేశములలో చలి విశేషమగుటచేత ప్రక్షాళనాదులకు గత్యంతరము కల్పింపబడుటయు స్నానములకు తగిన సదుపాయములు లేకపోవుటయును సంభవించుచున్నది. వారమున కొక్కసారి స్నానముచేయువారు కొందఱు మఱియెక్కువ కాలమువఱకు స్నానము

చేయకుండువారు కొందఱు నాదేశములలో గలరు. ఇప్పుడు భరతవర్ష
ములో సహిత మాంగ్లవిద్యార్థులు కొందఱు దినములకొలఁది స్నాన
మెఱుంగనివారు గలరని వ్రాయుటకు విషాదము గలుగుచున్నది. సక్ర
మముగ స్నానముల కవకాశములేక పాశ్చాత్యదేశములందు రోగము
లధికముకాగా కూనీమహనీయుడు వారిపాలిటఁ గల్పతరువువలె స్నాన
విధానము నొకదానిని వారికొఱకై యేర్పాటుచేసెను. పాశ్చాత్యులకు
స్నానముల కవకాశము లేనందున కొన్ని యేర్పాట్లు చేయబడవచ్చును.
మన కన్ని సౌకర్యము లుండి- త్రికాలములందు స్నానముచేయ వీలుగల-
మన యాంధ్రరాష్ట్రమునందు కూనీ పద్ధతి యాచరణకు వచ్చుట కడు
శోచనీయము. కూనీ మన హైందవశాస్త్రగ్రంథముల నాధారము
చేసికొనియే తన వైద్యపద్ధతి నవలంబించినటు లూహించుట కవకాశము
గలదు. మనయోగశాస్త్రమునందు- ధౌతి నేతి భస్త్రి మొదలగు పారి
శుద్ధ్య ప్రకరణములు గలవు. అందు భస్త్రిలో 84 విధములు గలవు.
జలభస్త్రి యనునది యందొకటి. ఆ ప్రకరణమున నాభిలోతువఱకు నీటినుండి
పారిశుద్ధ్యము నొందగల పద్ధతి వివరింపబడినది. దేహమునందలి యపరి
శుద్ధపదార్థములు భస్మమగుటకు ప్రాణవాయువే యాధారము. అది
చాలినంత లేనియెడల రోగములు తప్పవు. మనదేహమునందలి కల్మ
షము విశేషభాగము నిశ్వాసమువల్లను మఱింత యధోమార్గమునను కొంత
శరీరము త్యాగమునను వెలుపలికి బోవుచున్నది అనగాఁ గల్మషపదార్థము
లోని మాలిన్యము ప్రాణవాయువుతో గలిసి చెడుగాలిగను నీరుగను
వెలుపలబోవును. కాబట్టి కల్మషరాహిత్యమునకు ప్రాణవాయు వాధా
రము నావశ్యకము. ఇయ్యది ప్రాణాయామమువల్ల గలుగునని మన
ఋషులు దెలియజేసియున్నారు. దీని నాధారము చేసికొని యోగ
శాస్త్ర మేర్పడినది. కాని ప్రాణాయామమువల్ల సర్వరోగనివారణ
సాధ్యమైనను తదభ్యాసము సులభము గాదు. మనుజుడు సాధారణ
ముగా దినమునకు నాసికద్వారా 1000 గ్రాములు ప్రాణవాయువును
పీల్చును. చర్మముద్వారా లోపలికి బోవు ప్రాణవాయువు 500 గ్రాము
లు. ఇప్పుడు కూనీపద్ధతి ననుసరించుటవలన 500 గ్రాములనుండి
వేయిగ్రాములవఱకు ప్రాణవాయువు లోపలఁ బ్రవేశించును. అందు
వలన నచ్చటగల రోగాంకురములు శీఘ్రముగ నశించుట కవకాశము గలు
గుచున్నది. కాని సక్రమస్నానమున కవకాశము గలవారికి కూనీ
వైద్యము అంతవిశేషమైనది గాదు. ఆర్యధర్మములలో ముఖ్యమగు స్నాన
విధిని ప్రతిహైందవుఁ డాచరించినయెడల ననేకరోగములను దప్పించు
కొనవచ్చును. ప్రకృతిశాస్త్రము స్నానావశ్యకతను ధ్రువపఱచుచున్నది.
సముద్రోదకము స్నానమునకును బానమునకును మందుగా నుపయోగింప
వచ్చునని మన దేశాచారములు కొంతవఱకు దెలుపుచున్నవి. డాక్టరు
క్వింటను అను ఫ్రెంచిశాస్త్రజ్ఞుఁడు సముద్రపునీటిని రక్తముతో జేర్చిన
కలరా మొదలగువ్యాధులను నెటుల నివారణజేయవచ్చునో సహేతుక
ముగ వ్రాసియున్నాడు.

ప్రతిమతమువారును దైవప్రార్థనముఁ జేయుచున్నారు. బ్రాహ్మ
ణులకు సంధ్యావందనవిధానము గలదు. కాని దీనిలోఁ గల గాయత్రీ
ప్రాణాయామరహస్యాదుల గుర్తెఱిగినవారు కొలదిమంది సూర్యనమస్కా-
రాది ప్రార్థనలును- పద్మాసనాది నియమములును- వ్యాయామసాధనము
లునుగూడ నై యున్నవి. హోమముల కుపయోగింపబడు ననేకవిధము
లగు సమిధల వలన గలుగు ధూమమువలన నణుజీవులు నశించును.
ఇటువలెనే నేతిపొగకు గూడ నిట్టిగుణము గలదు. ఇల్లలుకుట కుపయో
గించు ఆవుపేడకు నిట్టి స్వభావమే గలదని పాశ్చాత్యశాస్త్రజ్ఞులు
వ్రాయుచున్నారు. కాని వీనన్నింటిని నిరసించు నవనాగరకులు కొందఱు
లేకపోలేదు. ఆర్యులు ఉపయోగించు పిండిముగ్గు లలంకారముకొఱకేర్ప
డినను పిపీలికాదులకాహారముగను ఉపయోగపడి వారిభూతదయకు నిదర్శ
నము లగుచున్నవి. ఆంగ్లేయవిద్యావ్యాపనచేతఁ గాబోలు మనబస్తీలును-
పల్లెలును-నానాటికి పాశ్చాత్యపద్ధతిని అనుకరించుచున్నవి. అతిథిపూజ
యును బలిహరణము నదృశ్యము లయినవి. భోజనమునకుఁ బూర్వము
వాయసాదులకు బలియొసంగనిదే భుజియింపనివా రనేకులు ఇప్పటికిని
మనదేశమునందు గలరు.

**ఆహారనియమములు:**—వీనిలోనెల్ల మున్ముందు బుద్ధి
వికాసకరమును శ్రేష్ఠము నగు శాకాహారమును పరికింపుడు. మాంసా
హారము దేహబలమునకును శౌర్యాదిలక్షణములకును సాధనమైనను
ఆరోగ్యమైనది కాదు. దీర్ఘాయువునకు సహకారి శాకాహారము. స్కాండి
నేవియాలో శాకాహారు లగు ప్రజలు నూరుసంవత్సరములవఱకు
జీవించువారు పెక్కండ్రు గలరు. ప్రపంచమునందలి జాతులలో శమ
దమాదిగుణములు గలిగి శాంతియుతులై పట్టుదలగలవారు శాకాహారు
లని సర్ లాడరు బ్రన్టను వ్రాయుచున్నాడు. దేహమునకు మాంస
మిచ్చు శక్తికంటెను శాకమిచ్చు శక్తియే హెచ్చని రుజువగుచున్నది.
అందునుగురించి డాక్టరు హెయిగ్ అను సుప్రసిద్ధ పరిశోధనకారుడు
వ్రాసిన సంగతులు ముఖ్యముగ గమనింపగోరెదను.

రక్తమాంసములలో చేరి దేహమునకు పుష్టినిచ్చు నాహారముల
లోని భాగములను పరిశీలించిన శాకాహారము చక్కగయును నెక్కువ
యుపయోగకారియు నని ధ్రువపడగలదు. శాకాహారమువల్ల గలుగు
విశేషశక్తిలాభములే గాక శాంత్యాదిసద్గుణములును నారోగ్యస్థితియును
మిక్కిలి ప్రశంసనీయములు. శాకములు చాలవఱకు సాత్వికాహారములు.
వీనివలన శాంతిగుణప్రాధాన్యము సిద్ధించును. మాంసాహారమువలన
శౌర్యగుణప్రాధాన్యము గలుగును. ఇందుకు నిదర్శనముగ జంతువులలో
మేకలను పులులను గాంచనగును. మహమ్మదీయులకును శూద్రాదులకును
గల శౌర్యము బ్రాహ్మణులకు లేదు. అటులే బుద్ధివిషయమున శాకా
హారులకు గల యవకాశము మాంసాహారులకు లేదు. ఇఁక శాకాహారము
లు శీఘ్రముగ జీర్ణమగుటయును మాంసాహారము ఆలస్యముగ జీర్ణమగు
టయును జూడ శాకాహారులకు గల యారోగ్యము మాంసాహారుల కుండ
జాలదని తెలియగలదు. జీర్ణముకాని పదార్థము గర్భకోశమున విశేష
కాల ముండుటచేత నచ్చట నణుజీవుల యభివృద్ధి కవకాశము గలిగి
యవియే రోగాంకురములు కాగలవు. ఈయుత్పత్తియణుజీవుల కారణము
ననే మనుజుల ప్రకృతియందు భేద మేర్పడుచున్నది. అవి యేర్పడి
నశించుటచేత పొత్తికడుపునందు మాలిన్య మధికమయి విషపూరిత మగు
నని వాన్ సోమిరాన్ హోరేసు ఫ్లెచెర్ అను శాస్త్రజ్ఞులు గొప్ప శారీర

అందువలన నితరవర్ణములవారు తమధర్మములను త్యజించుట కూడదనియు నొకరిని ధర్మపథమునకు తేఁబూనువారు తాము ధర్మబాహ్యులు కాగూడదనియు గ్రహింపవలెను. వ్యక్తులలో గలలోపములు నివారణ కాబడవలెను. కాని యావ్యక్తులకొఱకు సంఘనియమములను సడలించుట సబబు కాదు. ఆర్థికశాస్త్రానుకూల్యమగు వర్ణవిభాగము పారంపర్యముచే బలపడి శిల్పము పరిపూర్ణతకు సహకారియగుటచేతను పారిశుద్ధ్యశాస్త్రము ననుసరించి చేయబడిన నియమము లనేకములు చిరకాలముగ మనదేశాచారములందుండుటయు మనమతరహస్యముల తత్త్వము చాలవఱకు దురవగాహముగ నుండుటచేతను ప్రతిమతమువారును పలువారును వారివారి మతములకు లోబడిరి. లకట్టుబాటుల ననుసరించి నడచుట సాంప్రదాయమగుటచేతను మన ఆర్యధర్మములను పునరుజ్జీవింపచేయుట సమంజసముగాని వ్యక్తుల కొఱకు మతముతో సంబంధములేని సంఘనియమములు గలపాశ్చాత్యానుకరణము ననుసరించి సంస్కరణము గావింప గిట్టదు.

బ్రాహ్మణవిద్యార్థులును విద్యాధికులును ఆర్యావర్తచరిత్రము పాశ్చాత్యగ్రంథములనుబట్టి గాక మనదేశస్థులు పరిశోధనచేసి వ్రాసిన గ్రంథములనుండి తెలిసికొనవలయును. పూర్వ మెటు లార్యులు గంగాతీరమునందు గొన్ని యావులను శిష్యకోటినిగలిగి జీతముల కాశింపక యాశ్రమముల నేర్పఱచుకొని వేదాధ్యయనముతో పేరాశలను జెందక స్వతంత్రజీవనముఁ జేయుచు కృష్యాదులను సలుపుచుండిరో తెలిసికొని నచో దేశమున వృత్తులు పునరుద్ధారణ జెందినవై మనవ్యయములు కొంతవఱకు నశించుటకు తగిన పరిస్థితు లేర్పడగలవు. బ్రాహ్మణునికిఁ గల మనోబలముచేతను మతాచరణమువలనను కేవలము తపస్సువలన ధన్యుడు కాగలడు. ముక్కుమూసికొని కూర్చుండువానికి ముక్తి దొరకునేమో గాని భుక్తి యెటు లని సంశయింప బనిలేదు. విశ్వామిత్రునకు తప స్సెంత గొప్ప పదవిని గల్పించెనో తెలిసికొనుడు. పాశ్చాత్యశాస్త్రజ్ఞుల పరిశోధనలలో కేవలము గాలివల్ల మనుజుడు జీవించుట కవకాశము గలదా యనువిషయమును బార్థిలాట్ అను శాస్త్రజ్ఞుడు నిర్ధారణజేసియున్నాడు. వాయుధారణ యెంతెంత చేయబడుట కవకాశ మున్నదో యందులో మనుజునకు కావలసిన జీవపదార్థములు గల వని వ్రాసియుండెను. యోగాభ్యాసపరుల కట్టి శక్తి యుండినటులు పాశ్చాత్యశాస్త్రజ్ఞులు వ్రాసినవి చూడుడు. పొరుగింటి పుల్లగూర రుచి యని మన శాస్త్రములయందు విశ్వాసములేని విద్యార్థులును విద్యాధికులు నుంటనే నెఱుంగుదురు. గావుననే యట్టివారికై ప్రకృతిశాస్త్రజ్ఞుల నింతగా నెత్తి వ్రాయవలసివచ్చెను. 1705 లో ప్రచురింపబడిన లండను మెడికల్ ఫిజికల్ జర్నల్ 13వ వాల్యూము 309 పుటయందు ప్లాట్టర్ యొక్క ప్రకృతిచరిత్రగ్రంథములోనుగల దృష్టాంతములవలన హిందూయోగు లాహారము లేకుండ కుంభకమున ననేకదినము లుండినట్లు వ్రాయబడినది. ఇట్టి దృష్టాంతములు పెక్కులుగలవు. బ్రాహ్మణుల యుపనయనమునాటి యుపదేశము లెట్టివో గనుడు. ప్రాణాయామముచే శరీరారోగ్యమును దీర్ఘాయువును గలిగి యల్పాహారముతోఁ దృప్తిజెంది యార్థికముగ దేశభారమును తగ్గించుటకుగూడ నవకాశము గలవని నమ్మవలెను మనధర్మములను మనము త్యజించుటయుఁ పాశ్చాత్యశాస్త్రజ్ఞులు వానిరహస్యములను కొంతవఱకు దెలిసికొని మన యోగవిద్యామాహాత్మ్యమును గుఱించి యనేకగ్రంథములు రచించుటయే గాక అమెరికా మొదలగు దేశములం దనుష్ఠానవ్రతు లేర్పడుచుండుటను బట్టి మన మేమి గ్రహింపగలమో యూహింపుడు. లండను హాస్పిటలులో శరీరశాస్త్రపండితులగు డాక్టరు లియొనార్డు యెర్స్కిన్ హిల్ ఒకసారి సందర్భమున ప్రవేశించిన మల్లురులో కొందఱకు ప్రాణవాయువు నొత్తిత్తివండి పీల్చినంతలో మిగిలినవారికన్న వారు ముందుగా గమ్యస్థానము నెట్టిబడలిక లేకుండ చేరగలిగిరనియు వారదివఱకు చాల డస్సియుండ నట్టి ప్రాణవాయు వీయ్యబడినదనియు వ్రాసియున్నారు. ఇప్పుడు పాశ్చాత్యవైద్యశాలలలో ప్రాణవాయువుతో నెన్నిరోగములో కుదుర్పబడుచున్నవి. పరిశుభ్రమైన ప్రాణవాయువు తక్కువగు శరీరములకు వ్రణబాధ గలుగును. వారు ప్రాణవాయువు నుపయోగించి స్వస్థులగుచున్నారు. ప్రాణవాయువు చేయునది తప్తమే. దీపమునకుగాని అగ్నికిగాని ప్రాణవాయువులేనిది యవకాశము లేదని ప్రకృతిశాస్త్రజ్ఞు లెఱింగిన విషయమే. ప్రాణాయామమువలనగాని తపస్సువలనగాని జరుగు వాయుధారణ మిట్టి ఫలితము నిచ్చును. తపశ్శబ్దము తప్ కాల్చుట యను నర్థముగల ధాతువునుండి వచ్చినది. విశ్వామిత్రుఁ డట్టి తపస్సుచేసి వసిష్ఠునిచే మెప్పువడసి గాయత్రీప్రాధాన్యము నలోకమునకు జాటెననుటలో నాశ్చర్యము లేదు. తపశ్శాలురకు నణిమాద్యష్టసిద్ధు లుండెననిన నవ్వవలసిన నిమిత్తము లేదు. జర్మనుయుద్ధమునకు బూర్వము పుష్పకవిమానము కల్పితకథ యని యు నాగ్నేయాస్త్రసమ్మోహనాస్త్రములు మిథ్యలనియు ననినవా రెందఱో ప్రత్యక్షముగ నభిప్రాయములను మార్చుకొనిరి. మన హైందవులును కొన్నిసంగతులు సంఘలాభము నుద్దేశించి రహస్యములుగ నుంచి గురుపరంపరాబోధలకు లోబరచిరి. లాభమును పొందగోరి యేరహస్యమైనను సద్బుద్ధితోను వినయవిధేయతలతోను తెలిసికొనగోరిన నిజాభిలాషులకు పూర్వమున గురువు లుపదేశించుచుండిరి. ఇక్కాలమున వర్ణాశ్రమధర్మములకు సంఘట్టనము గలిగి చంచలనసక్కు లేర్పడి మతధర్మములందు భక్తివిశ్వాసములు చాలవఱకు నశించినందున తగు గురుశిష్యసాంప్రదాయము లంతరించుచున్నవి. ప్రత్యేకవ్యక్తులు గోరు మార్పులొకపక్క సంఘమునందలి యెక్కువమంది పూర్వసాంప్రదాయములను తెలిసికొనజాలక యంగీకరించినను పూర్వాచారములందు భక్తిగల కొలదిమందియైనను తమ మతధర్మములను కాపాడుకొనుట వారి విధియై యున్నది. భిన్నాభిప్రాయము గలవారు భిన్నసంఘముగ నుండవచ్చును. కాని పూర్వాచారములను ధ్వంసము చేయుటకై యట్టియాచారములకు దాసులగువారిని యిబ్బందిపఱచి సంక్షోభపఱచుటకుఁ బ్రయత్నించుట తగదని సంస్కర్తలు గ్రహింపవలెను. బ్రాహ్మణులు తమకు సేవకత్వము నక్రమముగ విధించిరను బ్రాహ్మణేతరులు వారిప్పుడు సక్రమముగ బుద్ధిపూర్వకముగ నిదివఱకుండిన స్వాతంత్ర్యము నువీడి దాస్యమునకు దిగుచున్నందున బ్రాహ్మణుల సేవకు బదు లితరుల సేవకులగుచున్నారు. బ్రాహ్మణులకిప్పట్టున దాస్యవిముక్తి దూషణవిముక్తి గలుగుచున్నందులకు హర్షించుచున్నాను. ఇప్పుడైనను పాశ్చాత్యవిద్యయొక్క వ్యామోహమువలన గలిగిన మతిభ్రమలను మార్చుకొని మనవారు స్వదేశీయతమయొక్కయు వ్యక్తులయొక్కయు సంబంధమును గలిగియుండినయెడల నార్యుల పూర్వపు టౌన్నత్యమును వివిధదేశములకు చాటగలము.

గ్రామమందును కులము శ్రేణి పూగము అను పేళ్లం బరగు గ్రామసంఘము లుండెడివి. గ్రామస్థుల సకలవ్యవహారములు-వివాదములు-ఈసంఘములవలననే పరిష్కరింపబడుచుండెడివి ఈసంఘసభ్యులు అధికారులు గ్రామస్థులే కాని రాజోద్యోగులు గారు. ప్రస్తుతము మనము ప్రతిష్ఠింప బ్రయత్నించుచున్న పంచాయతీకోర్టులు పూర్వకాలమున శ్రేణ్యాదిసంఘరూపములుగ నుండెడివి. ఈగ్రామసంఘములనిర్ణయ మసంతృప్తికరముగ తోచినవా రెవరో కొందఱు మాత్రమే రాజాధిష్ఠితమైన న్యాయస్థానమున కేగెడివారే, గాని సామాన్యవివాద లన్నిటికి నీసంఘములే చాలి యుండెడివి. ఈ సంఘములపై రాజునకు గల యధికార మతిస్వల్పము. ఈ పద్ధతిప్రకారము ప్రతిగ్రామమునకును రాజకీయవిషయములందేమి ఆర్థికవిషయములందేమి సాంఘికవిషయములందేమి సంపూర్ణమైన స్వయంనియంతృత్వము సిద్ధించియుండెడిది. స్థానికప్రభుత్వ మీరీతి ప్రజాధీనమైయుండిన నేకచక్రవర్తి చంద్రగుప్తుడైనను జహాంగీరైనను జార్జియైనను సమానమే. రాజు పరదేశీయుడైనంతమాత్రమున పారతంత్ర్యమువలని బాధ జనులకు గలుగదు. అనేకశతాబ్దములనుండి పరాధీనమై యుండియు మనదేశము కొలదిమార్పులతో తన స్వధర్మమును కాపాడుకొన గలిగియుండుటకు కారణ మిదియే. మఱియు మనదేశమందు ధర్మనిర్ణయాధికారము రాజునకు లేదు. తనప్రజలతోబాటు రాజును ధర్మబద్ధుడే. ధర్మమునకు మూలము అపౌరుషేయము అనంతము అనాదియై యున్న వేదముగాని రాజనిర్మితశాసనములు గావు. అధర్మమువలన గలుగబోవు ప్రత్యవాయము లౌకికమే గాక ప్రధానముగ పారలౌకికమై యుండుటచే కర్మభూమి యగు నార్యావర్తమున రాజదండనభీతికంటె నరకభయభావనయే ధర్మప్రవర్తనకు సాధకమై యుండెడిది. కావున కేంద్రప్రభుత్వముయొక్క అసమర్థతవలన ధర్మహాని కలుగుట కితరదేశములం దున్నంత నావకాశము మనదేశమం దుండెడిది గాదు. స్థానికప్రభుత్వము సుస్థిరమై ప్రజాధీనమై యుండుటచేత రాజదౌష్ట్యమువలన కూడ ప్రజల కంతబాధ కలిగెడిది కాదు. మహమ్మదీయప్రభుత్వము కడునిరంకుశమై ప్రజాక్షోభకరమై యుండెడిదని కొందఱు చరిత్రకారులు చెప్పుచున్నారు. కాని మహమ్మదీయచక్రవర్తు లందఱును దుర్మార్గులనుట కేవలము సాహసము. వారిలో ననేకులు తమ హిందూప్రజల క్షేమమునకై యనేక సదుపాయము లొనర్చి హిందూశాస్త్రములందును సారస్వతమునందును విశేషమగు నభిమానము గనబఱచి వాని నభివృద్ధి జేయుటకై యనేకరీతుల బ్రోత్సాహము నిచ్చినటులు మన కనేకనిదర్శనములుకలవు. వాదమునకొఱకు మహమ్మదీయచక్రవర్తు లందఱును నిరంకుశప్రభువులే యని అంగీకరించినను ప్రస్తుతము బ్రిటిషుపరిపాలనముక్రింద నార్యనాగరకతకు వైదికధర్మమునకు గలిగినంతహాని-మహమ్మదీయ దౌర్జన్యమువలన-వానికి గలుగలేదు- అని నొక్కివక్కాణింపవచ్చును.

మైకముచల్లి మతిచెడగొట్టెడివానికంటెను నెత్తికొట్టి సర్వస్వము నపహరించువాడు మన కుపకారికాడా? అట్లగుట వేయివర్షంబులనుండి యనేకులు పరరాజులచే జిక్కి హింసింపబడియును గసుగందని ఆర్యధర్మము నేడు తనవారిచేతనే గర్హింపబడి కడుంగడు కృశించి సమూలముగ నాశనమగుటకు సిద్ధముగ నున్నది. కావున మన ప్రస్తుతనిమ్నత్వమునకు గల ప్రధానకారణములు రెండు: (1) దేశీయులభావములు-రుచులు- సంస్కారములు- మాఱిపోయి స్వధర్మమం దభిలాషతగ్గుట. (2) స్థానికప్రభుత్వమందలి స్వాతంత్ర్యము నశించి గ్రామసంఘములు నామావశిష్టము లగుట గ్రామసంఘములు నశించుటచే మనకు వ్యవహారములు సర్దుబాటు చేసికొనగల శక్తి గూడ నశించినది. అన్నివిషయములందును కేంద్రప్రభుత్వపరాధీనత ఏర్పడినది. గ్రామస్థులం దైకమత్యము నానాటికి తగ్గిపోవుచున్నవి.

కొందఱ యభిప్రాయమున మనప్రస్తుతస్థితికి నీరెండును కారణములు గావు. కేంద్రప్రభుత్వము దేశీయుల యధీనమందు లేకుండుట యొక్కటియే మనదురవస్థకు కారణమని వీరందఱ ఈయభిప్రాయముపై నిర్మింపబడిన పాశ్చాత్యప్రభుత్వములందు స్థూలదృష్టికి రాజ్యతంత్రము ప్రజాధీనమై యున్నట్లు తోచును. గాని సూక్ష్మముగ విచారించినచో దనులే రాజ్యతంత్రాధీనులుగ నున్నట్లు స్పష్టమగును. ఏటి కెదురీదగలుగు నేర్పరియును- ప్రవాహవేగమునబడి కొట్టుకొని పోవువాడును- స్థూలదృష్టికిరువురును నీటిపై తేలయాడుచునేయున్నవారే. కాని ఒకనికి ప్రవాహము లోబడియున్నది. రెండవవాడు ప్రవాహమునకు లోబడియున్నాడు. ఇంతియే భేదము. పాలితుల సకలవ్యవహారములు రాజ్యతంత్రాధీనములై యుంట పాశ్చాత్యపద్ధతియనియును, దేశీయపద్ధతి ప్రకారము ప్రభుత్వమని వార్యమగు కీడగుటచే అవసరమగునంతవఱకు మాత్రము దానిని మారనిచ్చుటకు నీతియనియును- ఇదివఱకే వచించియున్నాము. కావున ప్రభుత్వము మనయధీనమైనంతమాత్రమున మనకు గలుగబోవు లాభములేదు. సకలమును రాజ్యతంత్రాధీనము చేయుటకు మనము సంసిద్ధులమై యున్నతరి ప్రభుత్వము స్వాధీనమైనను పరాధీనమైయున్నను విశేషభేదము లేదు. కొంపకాలుట వాస్తవమైనపుడు అయ్యది ధార్యాగ్నిసంపర్కము వలననైనను లౌకికాగ్నివలననైనను భేద మేమియులేదు. అట్లగుట మనదేశమున కభ్యుదయము కలుగవలయునన్న పశ్చిముల యధికారమాత్రమును కాక చాలవఱకు వీరిభావములను పద్ధతులనుగూడ నిరసింపవలసియున్నది. ప్రస్తుతదుస్థితికి కారణములు రెండని పైనుదాహరించియున్నాము. వాని నించుకంత విమర్శించి ఎంతవఱకు వానిని తీసివేయుటకు మనకు సాధ్యమగునో విచారింతము.

దేశీయుల భావములు రుచులు సంస్కారములు మాఱిపోయి స్వధర్మమందభిలాష తగ్గుట మొదటికారణముగా చెప్పియున్నాము:— ఒకవ్యక్తికి నుచితమగు ధర్మముకంటె మఱియొక వ్యక్తికి నుచితమగునది వేరు. అటులనే ఒక్కొక్కసంఘమున కొక్కొక్క ధర్మ ముచితమై యుండును. ప్రపంచమంతటను ఒకేధర్మము వ్యాపింపచేయుటకు ప్రయత్నించుట అస్వాభావికము. పరమార్థదృష్టియందు దప్ప ఐక్యమనునది నామరూపాత్మకమైన జగత్తునం దెచ్చటను లేదు. నామరూపములం దభిన్నత్వము సిద్ధించినను దేశకాల భేదములు తప్పవు. కావున భిన్నత్వమే ప్రపంచలక్షణము. అట్లగుట దేశభేదము చేత తత్తదుచిత ధర్మములందు గూడ భేద మేర్పడవలసి వచ్చుచున్నది. కావున, పశ్చిమదేశోచిత ధర్మములకంటెను ప్రాగ్దేశోచితము

వేఱు. పశ్చిములు మొత్తముమీద ప్రాపంచికులు. ప్రాగ్దేశవాసులు అందుచే ప్రధానముగ భారతీయులు పారమార్థికులు. ఆర్యుల జీవిత వ్యవహారము లన్నియు పారలౌకికములు. పాశ్చాత్యములవి ఐహికములు. భారతీయుల కైహికసుఖం దిశ్చ లేకపోలేదు. కాని ఇహపరములకు విరోధముగలిగినప్పుడు ఇహమును బ్యాజించి పరము నవలంబించుచుండుటయే వారికి ధర్మము. "యతోభ్యుదయ నిశ్శ్రేయససిద్ధి స్సధర్మః." కావున అభ్యుదయము శ్రేయము అను రెండును ధర్మాచరణకు ప్రయోజనములు. పశ్చిములకో శ్రేయముతో పనిలేదు. వారిదేశములందు ధర్మాచరణకు ప్రయోజనము జనబాహుళ్యముయొక్క సౌఖ్యము. దీనినే వారందురు కాని యొకవిధముగ నాలోచించిన పశ్చిములకు ధర్మమే లేదు. అనగా శ్రేయోభ్యుదయములకు రెంటికిని మూలమై మనుష్యజీవితమును సమగ్రముగ నియమించు ధర్మము పాశ్చిములకు లేదు అట్టిధర్మము లేకుంటయే నాగరికతకు లక్షణమనియు నవసరము ననుసరించి వారు వ్యవహారధర్మములను రాజశాసనములవలన ప్రవర్తింపజేసి ఇతరవిషయములందు జనులను స్వేచ్ఛగ ప్రవర్తింపనిచ్చుచున్నారు. రాజశాసనములవలన ధర్మము ప్రతిష్ఠాపింపబడుచున్నప్పుడే నూతనోద్దేశ్యముల కనుకూలముగ దేశకాలభేదముల ననుసరించి ధర్మము మాఱుచుండుటకు సావకాశము కలుగు ననియుం గొందఱు యభిప్రాయము. కాని మనదేశమందు మహమ్మదీయప్రభుత్వమునకు పూర్వ మెన్నడును రాజనిర్మితధర్మము లేదు. సకలధర్మములకు మూలము వేదము. స్మృతులుగూడ ననుమేయశ్రుతిమూలకములు. గాన తత్తుల్యములే. సామాన్యముగ ధర్మశాస్త్రములు ఆచారవ్యవహారప్రాయశ్చిత్తాధ్యాయములుగ త్రిధా విభజింపబడినవి. ఆచారాధ్యాయమునకెట్లో వ్యవహారమునకుగూడ నట్లే యపౌరుషేయమగు వేదమే మూలముగాని రాజశాసనము గాదు. అట్లగుట ధర్మప్రభుత్వమున శాసనధిక్కారమను భావనమునకే యవకాశము లేదు. నాస్తికులు వేదనిందకులు తప్ప పూర్వకాలమున నితరు లెవ్వరును శాసనధిక్కారముం జేసెడివారు కారు. వ్యవహారధర్మముగూడ వేదమూలకమై యున్నచో వేదమందు ప్రమాణబుద్ధిలేని ఇతరమతస్థులకే యది ధర్మముగ నుండెడిదని సందేహము కలుగవచ్చును. అట్టివారికి ధర్మము చాలవఱకాచారముపై నాధారపడియుండెడిది. ఆచారముగూడ ధర్మమూలములలో ముఖ్యమైనదని చెప్పియుంటిమి. వేదప్రామాణ్యమును బోధించిన స్మృతియే దేశధర్మములు జాతిధర్మములు శ్రేణీధర్మములుగూడ గౌరవింపబడవలయునని చెప్పియున్నది. "దేశధర్మ జాతిధర్మ కులధర్మాన్ శ్రుత్యభావా దబ్రవీన్మనుః" (వసిష్ఠః) మీమాంసకులుగూడ పరదేశీయుల యాచారములు మున్నగునవి యంగీకరించినటులు "మ్లేచ్ఛప్రసిద్ధ పదార్థాధికారణము" మున్నగు స్థానములం దెలియనయ్యెడు. కావున ధర్మమంతయు వేదముపై నాధారపడియుండుటవలన వ్యవహారమున కెట్టి బాధయుం గలిగెడిది కాదు. అట్లగుట హిందూదేశమందు నిరంకుశుడగు రాజు చేయు శాసనములు శాసనములు గావు. ఆతడును ధర్మబద్ధుడగుట నాతని నిరంకుశత్వము శాసనధిక్కారమనందగు ప్రస్తుతకాలమున 'లా'కు మూలము రాజగుట నాతడు నిజముగ నిరంకుశుడు. ఆతనిని నిర్బంధించు 'లా' ఏదియును లేదు. పదునాఱువత్సరములకు పైబడినవారి వంపఱను చంపివేయవలసిన దని రేపు శాసననిర్మాణసభవారొకశాసనము చేసినచో నట్టిశాసనము కేవలము రాక్షసకృత్యమైనను పాశ్చాత్యసిద్ధాంతముల ప్రకారము దానిని జనులు గౌరవింపక తప్పదు. అట్టి శాసనానుసారముగ జరిగింపబడిన హత్య లన్నియును నవీనసిద్ధాంతముల ప్రకారము 'లీగల్' కృత్యములే. కావున 'లా'కును న్యాయమునకును ఎట్టిసంబంధమును లేదు. పాలకు లదృష్టవంతులై మంచిప్రజ చేసికొన్నవారై యున్నచో 'లా' న్యాయానుసారముగ నుండును. లేకున్నచో 'లా' న్యాయానుసారముగ నుండవలయునను విధి ఎచ్చటను లేదు. ఆర్యసిద్ధాంతములకును పశ్చిమసిద్ధాంతములకును గల భేదస్వరూప మిట్టిది. ఈసిద్ధాంతములం దెయ్యవి జనాభ్యుదయమునకు హేతువులో చదువరులే యూహించుకొనవచ్చును

ఇక దేశకాలభేదోచితముగ ధర్మము మాఱుచుండుటకు మన సిద్ధాంతముల ప్రకారము సావకాశము లేదనుమాటకు మనధర్మశాస్త్రములు తొలుత నెట్లున్నవో అట్లే మార్పిచుకయు లేకుండ నున్నవని ఎవ్వరు ననజాలరు. కాలోచితముగ ధర్మశాస్త్రములును మాఱుచునే యున్నవి. క్రొత్తపద్ధతులు క్రమక్రమముగ వచ్చి దేశమునందు నాటుకొనవలయునే గాని హఠాత్తుగ వచ్చి పైబడినచో ధర్మహాని జనించును. పూర్వాచారపరాయణత్వమే గొప్పజాతులకు లక్షణమని కార్లైల్ మున్నగు బుద్ధిమంతులు వచించియున్నారు. పూర్వాచారములందాసక్తిగల సంఘమందు మార్పు గలుగవలయునన్నచో నట్టిమార్పులు నిజముగ జనులకు హితకరములు క్షేమకరములునై యున్నప్పుడే దేశమందు ప్రవేశింపగలుగును. లేకున్న బ్రవేశింపజాలవు. సంతతము నవీనపద్ధతులకై ఆరాటపడు సంఘములకు శాంతియును సౌఖ్యమును కలుగవు. వారి జీవిత మంతయును 'ఆచార్యులవారేమిచేయుచున్నారనగ తప్పులుచేసి దిద్దుకొనుచున్నా' రనునట్లుండును.

అవసరమైనచో ధర్మశాస్త్రములుగూడ మాఱుచుండకున్న నాశాస్త్రములు జనులచే గౌరవింపబడవు. మనుస్మృతినాటికంటెను యాజ్ఞవల్క్యస్మృతికాలమునకు వ్యవహారధర్మము వృద్ధిచెందినది. మనుస్మృతియందు వ్యవహారమునకు ప్రత్యేకముగ నొకయధ్యాయము వినియోగింపలేదు. యాజ్ఞవల్క్యమునందు వ్యవహారమునకు ప్రత్యేకముగ నొక యధ్యాయమిచ్చియున్నాడు. నారదస్మృతికాలమునకు వ్యవహారధర్మము మిక్కిలి వృద్ధిచెందినట్లూహింప దగు. నారదస్మృతిలోని వ్యవహారవిషయములు నేటిశాసననిర్మాతలును న్యాయవాదులును మెచ్చదగినవై యున్నవి.

మఱియును పూర్వాచారములు అనేకములు జనుల కనిష్టములగుటచే ధర్మశాస్త్రగర్హితములై నేడు పూర్తిగ నాచరణనుండి తొలగినవి. దేవరన్యాయము- ద్వాదశపుత్రదాయక్రమము- అష్టవిధవివాహములు- నేడు అంగీకరింపబడుటలేదు. ఇంతియగాక శాస్త్రవిరుద్ధముగకూడ కొన్నియాచారములు శిష్టులచే సదాచారములుగ నంగీకృతములైనవి. మాతులసుతోద్వాహము- దౌహిత్రస్వీకారము- మున్నగునవి ఇందుల కుదాహరణములు.

కావున కాలానుసారముగ శాస్త్రములు మాఱకపోలేదు. శాస్త్రములు మాఱినను కొన్ని విషయములందు సదాచారమే ధర్మముగ నంగీకరింపఁబడెడిది. వేదమునకు స్మృతికి తరువాత సదాచారమే ధర్మమునకు మూలము. కాని పూర్వము 'ధర్మములు' మార్పుచెందెను. గాని 'ధర్మమున' కేమార్పును గలుగలేదు. అనగా కాలానుసారముగ నవసరమగునంతవఱకు ప్రత్యేకధర్మములు మార్పుచెందెను- గాని ఆర్యధర్మమునకు పునాదియైన భావములు- సంస్కారములు- నమ్మకములు- ఇంచుకంతయును మార్పు జెందలేదు. ఆపునాది సుస్థిరమైయున్నంతవఱకు పై కట్టడమున నవసరమగునన్ని మార్పులు చేసికొనుటకు ధర్మశాస్త్రములందనేక పావకాశములు గలవు. ఉపయోగించుకొనఁగలిగినచో నాయవకాశము లిప్పటికిని నున్నవి. కాని పూర్వకాలమున మనదేశస్థులు చేసిన సంస్కరణములకును ఇప్పుడు మనలో గొందఱు కావలయునను సంస్కరణములకును గొప్పభేదము గలదు. పరసాంప్రదాయమం దేదేని గ్రహింపదగిన విషయమున్నచో నద్దానిని మెల్లగ నవలంబించి తమదిగా చేసికొనుట పూర్వసంస్కరణపద్ధతి. పరమతములందు కొన్నికొన్ని మంచి విషయములను కాంచి వానిని మెచ్చి స్వమతము నగ్నించి తత్పరమతమునకు లోబడిపోవుట నవీనసంస్కరణపద్ధతి. కావున నవీనసంస్కరణపద్ధతి వలన స్వరూపనాశనమే కలుగబోవుచున్నది. స్వధర్మమం దాసక్తి గలవారు నూత్నసంస్కరణములకు విముఖు లగుటకు ఇదియే కారణము. అంతియ కాని తనస్వత్వమును కాపాడుకొనగలిగినంతవఱకు ఆర్యధర్మ మెప్పుడును సంస్కరణపరాఙ్ముఖము అగుటలేదు.

సూక్ష్మముగ విచారించినచో నార్యధర్మమంతటి యుదారస్వభావము గల ధర్మము మఱియొకటి లేదు. "అహమాత్మా బ్రహ్మ" యనుకొను నద్వైతసిద్ధి నొందు బ్రహ్మజ్ఞుడును గంగానమ్మ పోలేరమ్మ మున్నగు గ్రామ్యదేవతల నారాధించు పామరుడును ఇరువురును హిందువులే. ఇరువురకును ప్రామాణ్యబుద్ధి శ్రుతి- స్మృతి-పురాణములందే. వర్ణాశ్రమధర్మముల నావంతయు నడుగుదాటక- నియమముల నన్నిటిని పాటించుచు- వేదవిహితకర్మల యథావిధిగ నాచరించుగృహస్థుడును- విధినిషేధముల కతీతుఁడై ఏచ్చటనేని దిరుగుచు నేమేని గుడుచుచు స్వచ్ఛంద విహారము సలుపు యోగిపుంగవుడును ఇరువురు హిందువులే. ఇరువురకును ప్రమాణములు వేదములే. ఏమతమైననుసరే- ఏసాంప్రదాయమైననుసరే- తన శరణుచొచ్చిన దానిని పరధర్మమని పోద్రోలక ఆర్యధర్మము ఆ నూతనసాంప్రదాయము తనదానిగనే స్వీకరించియున్నది.

మంచిచెడుగులు పరమార్థతః లేవు. గాని కొన్నిసందర్భముల కొందఱపట్ల మంచియైనది మఱికొన్ని సందర్భముల చెడుగగును. కావున నెప్పు డెయ్యది ఎంతవఱకు క్షేమకరమో అంతవఱకు దాని నవలంబించి అయ్యది క్షేమము కానప్పుడు దానిని త్యజింపవలయును. శ్రేయోభ్యుదయజనకత్వమే క్షేమమునకు మానము. అట్టిక్షేమమే ధర్మాచరణము ఫలము.

ఆర్యధర్మముయొక్క మూలసూత్రములకు భంగములేనంతవఱకు నూత్నసంస్కరణములకు ధర్మశాస్త్రము లెప్పుడును నభ్యంతరములు కావు. కావున మనకు ప్రస్తుతము కావలసినవి రెండు. స్వధర్మమం దనురక్తి— స్వధర్మాచరణకు తగినయవకాశము. స్వధర్మమం దనురక్తి మన కొకరిచ్చునది గాదు. అయ్యది మనకు సహజముగ కలుగవలసినదే. ఇక స్వధర్మాచరణమున నావకాశములు. వీని నొడఁగూర్చునది స్వపరిపాలనముతప్ప వేఱొండులేదు. అట్టిస్వపరిపాలనమును మన కిప్పుడిచ్చువా రెవరును లేరు. ఇచ్చినను అట్టి బిచ్చపుగూడువలన మనకు పొట్ట నిండదు. కావున ప్రకనిశ్చయులమై స్వయంకృషివలన మనము స్వరాజ్యమును సంపాదించుకొనవలయును. మన స్వరాజ్యసంపాదనమునకు కత్తు లక్కఱలేదు. మందుసామాను లవసరము లేదు. దీనికి వలయు సామగ్రి-మనోదార్ఢ్యము ఐకమత్యము స్వధర్మానురక్తి. ఈసామానులను మనము సమకూర్చుకొని ఎన్నిఅభ్యంతరములు వచ్చినను జంకక స్వధర్మాచరణ కవకాశము కలుగజేయు ప్రతిష్ఠాపనలను స్థాపింపవలయును. ఈపద్ధతివలన బ్రిటిషుప్రభుత్వమువారడ్డి యుండ మనకు స్వరాజ్యము సిద్ధించును. సహాయనిరాకరణోద్యమసూత్రముల ప్రకారము ప్రస్తుతము మనము చేయదగిన పను లనేకము లున్నవి. వానియన్నింటిలోనికి ముఖ్యతమమైనపని గ్రామసంఘములను పునరుద్ధారణచేయుట. ఇంతకాలమునుండి ఆర్యధర్మములు నిలిచియుండుటకు కారణము మన గ్రామసంఘములు తప్ప మఱి వేఱు కాదని చెప్పియున్నాము. ప్రస్తుతకాలమున గ్రామసంఘములు నశించుటతోమాత్రమే ఆగక గ్రామములే నశించుస్థితి వచ్చుచున్నది. ఇక మనస్వధర్మమును నిలుపవలయునన్న నెట్లు నిలువగలదు? గ్రామముల పాడుపెట్టి పట్టణముల నిర్మించుట పాశ్చిమనాగరకతకు లక్షణము. దానికి కారణము వాణిజ్యదాహము. ధనతృష్ణ మిథ్యాజ్ఞానము అనుదినమును కొంచెముకొంచెముగ పాలుతీసుకొనుటతో తృప్తిజెందక పాలన్నియు నొకేసారిగ నాపోశనము చేయుదమను దురాశతో నావుపొదుగును గోయు మూఢునిభంగి పశ్చిముల ననుకరించుచు నేడు మనవారుగూడ యంత్రశాలానిర్మాణమునకు గడంగి లక్షలకొలది పనివాండ్రను కొన్నికొన్ని పట్టణముల ప్రోగుపోసి స్వర్గఖండము లనందగు జనపదముల పాడుపెట్టుచున్నారు.

మనుష్యప్రయత్నముల కన్నిటికి పరమావధి ఆనందముగాని యుద్ధము గాదు. అయ్యది శాంత్యధీనము. కావున మనుజుడు కోరదగినది శాంతియే. ఆశాంతి పల్లెలలో దక్క పట్టణములలో దొరకదు. పల్లెపట్టులు శాంతికి ఖను లనందగును. అట్లగుటఁ బల్లెల నుద్ధరించుట మన ముఖ్యకర్తవ్యము. పల్లెలనుద్ధరించుట యెట్లు? అదియే మనదేశమందలిబుద్ధిమంతు లందఱును ఇప్పు డాలోచింపదగిన విషయము. ఇట్టి విచారణ చేయునప్పుడు అన్నిటికిని మూలసూత్రమగు విషయమును మాత్రము మఱవగూడదు. ఆసూత్రమే మనస్వధర్మమునం దనురక్తి మనకు తిరిగి జనింపవలయును. లేకున్న జనపదములు బాగుపడుటయే కల్ల. స్వధర్మమం దనురక్తి హెచ్చినగాని వాణిజ్యదాహ మారదు. ఆదాహము తీఱినగాని ఫ్యాక్టరీపద్ధతి మాఱదు. అయ్యది మానినగాని పాటకపుజన మంతయు పల్లెల పాడుపెట్టి పట్టణములకు జేరు దుర్బుద్ధి నశింపదు.

మొత్తముమీద మన దారిద్ర్యకారణములు మూడువిధములు. (1) వర్తకమూలకముగ పరదేశీయులు దోచుకొని పోవుచున్న సొమ్ము.

(2) మనదేశపు ముడివస్తువుల నెగుమతిచేసి పరదేశములనుండి సామానుల దిగుమతిచేసికొను షావుకారుల లాభములు. (3) మూడవది ఈయది 'ధర్మకర్చు'. ఈయది ప్రభుత్వమువారు మనకడనుండి గ్రహించునది. ఇది ధర్మకర్చు ఎట్లగునని యందురేమో. ప్రభుత్వమువారు మనల నజ్ఞానాంధకారమునుండి యుద్ధరింప మనపై నిర్హేతుకజాయమాన కరుణాకటాక్షప్రసారము గావించి మెల్లమెల్లగ విద్దెముల నేర్పి మనలను పెద్దవారిని చేయుటకు భారము వహించి యున్నారు. దీనినే శ్వేతముఖుని భార మని అనేక గ్రంథముల వ్రాసియున్నారు. ఇట్టిభారము వహించినవారు మనకు గురుప్రాయులు గాన వారికిచ్చిన సొమ్ము గురుదక్షిణ యనందగు. గురువు శిష్యునివలన గ్రహించు విత్తము వేతనమని గాని కూలియని గాని పన్నని గాని యనుట ఆర్యధర్మమునకు కేవలము విరుద్ధము.

ఈ మూడు విధము లగు వ్యయములను తగ్గించుట కుపాయము మహాత్ముం డిదివఱకే బోధించియున్నాడు. ఆమార్గముల మన మాచరణలో పెట్టి జనపదముల నుద్ధరింపవలయును. ఇట్లు జనపదముల యార్థికస్థితి జక్కచేసి ఇతరవిషయములందు గూడ ప్రభుత్వమువారి యపేక్ష లేకుండ మనవ్యవహారముల మనమే నిర్వహించుకొనుటకు తగినవీలును కలుగజేయు ప్రతిష్ఠాపనలను నిర్మింపవలయును. అట్టి ప్రతిష్ఠాపనముల యం దగ్రగణ్యములు గ్రామసంఘములు. గ్రామసంఘముల పునరుద్ధారణచేసి పూర్వపు మన స్థానికప్రభుత్వపద్ధతిని తిరిగి ప్రతిష్ఠింపవలయును. అది ఎట్లు చేయవలయునో అనుభవజ్ఞు లగు బుద్ధిమంతు లందఱును కలసి ఆలోచింపదగినవిషయము. కాని మనము స్వరాజ్యమును నిర్మించుకొను నప్పుడు ముఖ్యముగ మనస్సునం దుంచుకొనవలసిన విషయ మొక్కటి గలదు. అద్దానిని మన మెన్నడు నేమఱగూడదు. అది "స్వధర్మము."

స్వధర్మములేని స్వరాజ్యమందు మనకు స్వత్వములేదు. స్వధర్మములేని స్వరాజ్యమువలన మన కొకరీతి దాస్యము వదలి మఱియొక రీతి దాస్యము మిగులును. శరీరదాస్యము సహింపవచ్చును గాని భావదాస్యము దుస్భరము. ఇదియే "చెఱసాలల్ వరచంద్రశాలల యగున్" అని దేశభక్తులకు ప్రోత్సాహమిచ్చిన కవివరుల యంతర్భావము.

# ఇంద్రనీలములు - అన్యోక్తులు

## ఎడవల్లి గంగాధర బుచ్చిరామశాస్త్రి గారు

నీలమా పుష్యరాగంబ నీవయగుచు
పిదప పద్మరాగంబుగా పేరుబొందు
పద్మరాగాన వజ్రమై పరిణమించు
బహుళజన్మల నీవు సాఫల్య మొంద.

గీ. హీరనీలములపుట్టుక యేకదేశ
మనుచు భేద మేమి టనుట యవకతవక
హీరకాంతికి విలువకు నేమి సాటి?
నీలమా చెప్పు బాగుగా నీవ యరసి.

గీ. తెలివియందునం దేటలో దిటవునందు
సాటియౌ నీల మాహీర సంఘమునకు
క్షీరముల గ్రోలి కసవు భక్షించి మనుట
కన్నుగలవారి కెల్లను గానరాదె.

గీ. ఇంద్రనీలములమనుచు నెగురవలదు
ఇంద్రు డెవ్వరిదైవమో ఇంచుకైన
ఇంద్రుక్షేత్రచారిత్ర మీ వెఱిగియుండి
పాలమునిబోలు ప్రజలన్న బాగుగాదె!

గీ. ఎక్కువైతేమి యాస్తత వెరిదిగిన
పట్టువచ్చినమాత్రానం బ్రమదమేల
హాటకమకుటదేశంపు గాటువీడి
నీలమా దయచేయు నీ కేరు దిక్కు

గీ. ఇంద్రనీలము లైనంత నేమి మిమ్ము
తినదు సంబంధు లయ్యేన దలపకుండ
వజ్రియై పరభూభృత్స్వపక్షు డయ్యె
కార్యఘటనను మిమ్ము పాకారి వీడె.

గీ. నీలమా నీదుకంటెను నీచుడొకడు
గలడు కుందకు నదిలోన తెలుపగలను
వాడు గోమేధనాముం డాపాపరాశి
వానితో బొందు మున్మారు వలదు నీకు.

గీ. అగయ వైకుంఠపాలికన్ గూటయందు
నిచ్చొనెక్కియు మురిసెదు నీచునట్లు
మూరిపోవుచుంటివి నీలమా ముందుజూడు
సూటపాలింటగలపాము, వోటబడుదు.

